6-11-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :45 విడి ప్రతి: రూ.2.00

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



## ఎప్పటి ఎన్ని కలకో ఇప్పటి నుంచే ఆరాటం!

రాష్ట్ర రాజకీయాలు విచిత్రంగా దినదినానికీ ఉద్రిక్తత పెంచుకుంటున్నాయి. శీతాకాలంలో వేసవి ఎండలు కాస్తున్నాయి. ఇటు కాంగ్రెస్, అటు తెలుగు దేశం పార్టీలు రెండూ ఈ సెగకు మంట ఎగద్రోస్తుండడం విశేషం. సాధారణంగా ఎన్నికల గడువుకు ఆరునెలల ముందు అటువంటి పరిస్థితి ఏర్పడుతుంటుంది. కాని రాష్ట్ర శాసన సభ ఎన్నికలు 1994 అంతం లేదా 1995 ప్రథమార్థంలో జరగాలి. ఎట్లా లేదన్నా రెండేళ్ల వ్యవధి వుంది. ఈలోపలే ఇంతటి ఉద్రిక్తత ఏర్పడడం అసాధారణమైన విషయం.

విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రి అయిన క్షణం నుంచే 1982 నాటి ముచ్చట్లు జ్ఞప్తికి తెచ్చుకుంటున్నారు జనం. ఎన్టీఆర్ కూడా తరచు, తిరిగి విజయభాస్కరరెడ్డి నుంచే తాను అధికారం అందుకుంటానని ప్రకటిస్తున్నారు. ఇది ఆ వృద్ధనాయకుడిలో కోపం తెప్పించింది. 1982లో తెలుగు దేశం గెలుపుకు విజయభాస్కరరెడ్డి కారణం కాదు. ఆయన పట్టుమని పదివారాలు రాజ్యం చేయకముందే ఎన్నికలు వచ్చేశాయి. కాని నింద మాత్రం ఆయనపైనే పడింది. దాన్ని రూపుమాపుకోవాలన్నది ఆయన ఆరాటం. తన ప్రభుత్వం నిర్వహించే ఎన్నికలలో కాంగ్రెస్ తిరిగి విజయం సాధించాలన్నది ఆయన రాజకీయ జీవితపు చివరి కోరికగా మారింది. అందుకే అంత అసహనంగా, ఉడుకుమిడుకుగా వుంటున్నారు. నిన్న ( 5 తేది) రాత్రి జరిగిన ప్రజాస్వామ్య సంక్షేమ దినోత్సవం ఏర్పాటు ఈ హడావుడిలో భాగమే. ఈ సభ ద్వారా ప్రజలను ఆకర్షించే పథకాలు ప్రకటించి, కాంగ్రెస్ పట్ల అభిమానం పునరుద్ధరించాలనుకున్నారు. కాని ఆ సభ ఆ ఉత్సాహాన్ని రేకెత్తించలేదు. కొత్తగా జనం మోజుపడే పథకమేదీ ప్రకటించలేక పోయారు. ఆయన మాత్రం ఏమి చేస్తారు. - ఖజానా వట్టిపోయి వుంది. అప్పటికి రైతులకు విద్యుత్ రాయితీ, సబ్సిడీ బియ్యం కోటా 20 కిలోలకు పెంపు,

### హైదరాబాద్ వార్తా కథనం

ఎరువుల ధరల తగ్గింపు నిర్ణయాలు చేశారు. గ్రామీణ ప్రాంతాలలో వీటి ప్రభావం పెద్దగా వుంటుందని భావించలేము. తన ప్రభుత్వ అవినీతికి దూరంగా వుందని సాక్ష్యాధారాలతో సహా నిరూపించడం ద్వారా ప్రజలలో కాంగ్రెస్ పట్ల వున్న తేలిక భావాన్ని తొలగించాలనేది మరొక ప్రయత్నం.

ఎన్టీరామారావు గారు విజయభాస్కరరెడ్డి గారి కంటే స్పీడుగా వున్నారు. పచ్చగడ్డి మోపును చూసిన అంబోతు మాదిరి ఆయన కళ్లముందు ముఖ్యమంత్రిత్వాన్ని నిలుపుకొని పరుగులు పెడుతున్నారు. రామన్న ఎన్నికల్లో అధికారం తనదేనన్న నిశ్చితాభిప్రాయంతో మాట్లాడుతున్నారు. 82 నాటి ఉద్రిక్త పరిస్థితులను రెచ్చగొట్టడానికి సారాయి ఉద్యమం ఉపకరిస్తున్నది. ఆ సాకుతో రాష్ట్ర

కొరవ 6 పేజీలో




జమీన్‌రైతు నూతన భవన దృశ్యం; ప్రారంభోత్సవ శిలాఫలకం ఎదుట జనార్దనరెడ్డి, [illegible]

## 'జమీన్‌రైతు' సాయం దినపత్రికగా ఎదగాలి!

జమీన్‌రైతు నూతన భవన ప్రారంభోత్సవం 31 తేది సాయంత్రం ఆహ్లాదకర వాతావరణంలో, అభిమానుల సమక్షాన, ఆత్మీయంగా జరిగింది. మాజీ ముఖ్యమంత్రి శ్రీఎన్.జనార్దనరెడ్డి శిలాఫలకం ఆవిష్కరించి లాంఛనంగా ప్రారంభించారు.

జమీన్‌రైతు పట్ల జిల్లా ప్రజానీకంలో, పెద్దలలో వున్న ఆపేక్షకు, అభిమానానికి నిదర్శనంగా జరిగింది కార్యక్రమం. పార్టీలకతీతంగా నాయకులు, వివిధ శాఖల అధికారులు, టౌన్‌లోని పలువురు ప్రముఖులు విచ్చేసి, తమ అభిమానం ప్రదర్శించారు.

చిన్న సభ. ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి అధ్యక్షించారు. సమాచార శాఖామంత్రి శ్రీ పసల పెంచలయ్య ఎన్నిదిన పత్రికలు వచ్చినా, నెల్లూరులో జమీన్‌రైతుకు పాఠకులు తగ్గలేదని, ఎడిటర్లు మారుతున్నా వార్త రచన శైలి మారలేదని, చిన్న పత్రికల మనుగడకు తన శాఖద్వారా చేయదగిన, చేయవలసిన కృషి అంతా చేస్తానని చెప్పారు.

### నూతన భవన ప్రారంభోత్సవంలో ఆశీస్సులు!

సుబ్బరామరెడ్డిగారు - అమెరికా వంటి విదేశాలలోనూ నెల్లూరీయులు జమీన్‌రైతును క్రమం తప్పకుండా చదవడం చాలా గొప్ప విషయమని అభినందించారు. ఎమ్పీ కుమారి కె. పద్మశ్రీ , శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి, జమీన్‌రైతు కమిటీ తొలి అధ్యక్షుడు స్వర్గీయ బెజవాడ వేణుగోపాలరెడ్డి మేనల్లుడు శ్రీ ఏనుగ సీతారామిరెడ్డి జమీన్‌రైతును అభినందిస్తూ మాట్లాడారు.

జనార్దనరెడ్డిగారు జమీన్‌రైతుతో తనకు గల సుదీర్ఘ అనుబంధాన్ని ప్రస్తావించారు. నెల్లూరు జన జీవితంలో జమీన్‌రైతుప్రభావం అపరిమితం. పెద్దపెద్ద పెట్టుబడులతో వ్యాపార పరంగా నిర్వహించే దినపత్రికల వల్ల జమీన్‌రైతు వంటి చిన్న పత్రికల మనుగడ కష్టసాధ్యమై పోతున్నది. తమను దెబ్బ తీసిన దినపత్రికలను దెబ్బతీయడానికి జమీన్‌రైతు ఒక సమగ్రమైన సాయం దినపత్రిక వెలువరించాలి అన్నారు శ్రీజనార్దనరెడ్డి . కొత్త భవనంతో పాటు, అధునికమైన ప్రింటింగ్ ప్రెస్‌ను సైతం సమకూర్చుకోవాలని అభిలషించారు.

తెలుగు జర్నలిజం తీరు తెన్నులపై ఈ సందర్భంగా శ్రీ జనార్దనరెడ్డి ఆవేదన వ్యక్తం చేశారు. రాను రాను పత్రికలు సమాజానికి కీడు చేసేవిగా తయారౌతున్నాయి. సెన్సేషనలిజం పేరుతో రాజకీయాలలో వున్న వారి వ్యక్తిత్వ హింసకు పాల్పడుతూ, తప్పుడు వార్తలు వ్రాస్తున్నారు. రాజకీయాలలోకి వచ్చేవారు వీటివల్ల ప్రతిష్ట కోల్పోయి మానసిక క్షోభననుభవించవలసి వస్తుంది. ఏ పని చేయాలన్నా పత్రికలకు భయపడవలసి వస్తున్నది. తప్పుడు వార్తలు వ్రాసే జర్నలిస్టులపై చర్య తీసుకునేందుకు ఒక చట్టం తయారుచేయవలసిన అవసరం కన్పిస్తున్నది - అన్నారాయన. ఒక వార్త వ్రాసే ముందు అది ఎంతవరకు నిజమో పాత్రికేయులే ఆత్మ పరిశీలన చేసుకోవాలని కోరారు.

సభను తొలుత మేనేజింగ్ ఎడిటర్ శ్రీ నెల్లూరు శ్రీరామమూర్తి స్వాగతించారు . జమీన్‌రైతు నూతన భవనం సమకూర్చుకోవడంలోని సాధక బాధకాలు , పాతభవనం చరిత్ర వివరించారు.

# అటు సూర్యుడిటు పొడిచినా

## వేమారెడ్డి, నల్లపరెడ్డి కలయిక

# జరగడం అసంభవం!

వేమారెడ్డి, నల్లపరెడ్డి వర్గాల మధ్య సయోధ్య అంటూ మొన్న ఒక దినపత్రిక వార్తా బాంబు పేల్చింది. ఉప్పు, నిప్పు ఒకేచోట కలిసి సంసారం చేయనున్నాయని చెప్పినట్లుంది వార్త. వారిద్దరి మధ్య వున్న దాయాదిపోరు ఎరిగిన వారెవరికైనా ఈ వార్త చదివితే సూర్యుడు దిశమార్చుకొని పశ్చిమాన ఉదయించాడా అన్న సందేహం కలుగుతుంది. నలభై ఏళ్ల వైరం ఇద్దరిదీ! ఎన్ని రాజకీయ మార్పులు వచ్చినా ఆ శతృభావాలు తొలగలేదు; ఒకరికొకరు

### జిల్లా రాజకీయాలు

ఎదురు పడితే తీష్ణ కవోష్ణ, రుధిర వర్ణ దృక్కులు ప్రసరించుకోవడం మానలేదు; మానరు కూడా! అటువంటి కత్తులు రెండూ ఒకే ఒరలో ఒద్దికగా కుదురుకున్నాయని చెప్తే నమ్మేదెట్లా?

కోఆపరేటివ్ బ్యాంకు అధ్యక్షుడు శ్రీవేమారెడ్డి రామచంద్రారెడ్డి స్వర్గీయ నల్లపరెడ్డి గోపాలరెడ్డి కుమారుడు జగన్మోహనరెడ్డి ఇంటికి విందుకు వెళ్లడాన్ని ఆధారంగా తీసుకుని ఈ వార్త అల్లినట్లున్నారు. జగన్మోహన రెడ్డి కూడా ఒక సింగిల్ విండో అధ్యక్షుడు. ఆరోజు కోటలో బ్యాంకు బ్రాంచి సమీక్షా సమావేశం జరిగిందట. రామచంద్రారెడ్డి గారు ఆ పనిపై కోటకు వెళ్లారు. బ్యాంకు సిబ్బంది అందరికీ ఆ రోజు జగన్మోహనరెడ్డి విందు ఏర్పాటు చేశారట. రామచంద్రారెడ్డినీ రమ్మని పిల్చారు. ఆయన ఎక్కడుంటే అక్కడకు ఫోన్లమీద ఫోన్లు చేసి బలవంత పెట్టారట. సరేననక తప్పలేదు. తిని, త్రేన్చి రావడం తప్ప ఆ సందర్భంలో మరే రాజకీయ కార్యకలాపమూ జరిగినట్లు లేదు. కానీ, ఎదురు పడితే కత్తులు దూసుకునే రెండు కుటుంబాల వారు ఒక ఇంట్లో చేరడం రాజకీయ పరిణామమేనని ఆ విలేఖరి భావించినట్లుంది. లోతుకు దిగి ఆలోచించకుండా పైపైన చూస్తే అది సహజం కూడా!

అయితే కేవలం ఒకే ఒక విందుతో దశాబ్దాల క్రోధావేశాలు సమసి పోతున్నాయనుకోవడం వట్టిభ్రమ. అప్పుడప్పుడు జనం కళ్లనీళ్లు తుడవడానికో, తమ ఉదారత చాటుకోవడానికో గాని ఈ రెండు కుటుంబాల వారు ఏదో ఒక సందర్భం చూసుకొని ఒకరింటికి మరొకరు వెళ్తుంటారు. జగన్మోహనరెడ్డి తండ్రి గోపాలరెడ్డి మరణించినప్పుడు, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఆస్పత్రిలో వున్నప్పుడు సాక్షాత్తు జనార్దనరెడ్డి గారే వెళ్లి పరామర్శించి వచ్చారు కదా! ఇదీ అంతేననుకోవాలేమో!

అసలు జగన్మోహనరెడ్డి రామచంద్రారెడ్డిని అంత పట్టుదలగా ఎందుకు విందుకు తీసుక వెళ్లినట్లు? నల్లపరెడ్డి కుటుంబంలోని యువతరం రాజకీయలలో విన్పించే అసూయలు, అసంతృప్తుల ప్రభావం ఏదైనా వుందా? ఏమో! ఈ విందుకు నల్లపరెడ్డి



నలభైఐదేళ్ల పాటు జమీన్ రైతుకు నీడనిచ్చిన తిప్పరాజువారి వీధిలోని పాత భవనం

శ్రీనివాసులు రెడ్డి గాని, చంద్ర గాని, ఈ ఇద్దరి సంతానం కాని హాజరు కాలేదు. వూళ్లోవుండే రాలేదు. చంద్రశేఖర రెడ్డిగారు మాత్రం షరామామూలుగా ఆస్పత్రిలో చేరడానికి ఆ ఉదయమే అర్జెంటుగా మద్రాసు వెళ్లారట. ఒకరోజు తిట్టుకొని, ప్రక్కరోజు కౌగలించుకోవడం

పెద్దసోదరు లిద్దరికీ అలవాటేకాని, వారి సంతానం మధ్యమాత్రం ఆ ఒద్దిక లేదు వారిలోని రాజకీయాల పట్ల అసంతృప్తి ప్రకటించడానికి జగన్మోహనరెడ్డి ఈ విందును ఏర్పాటు చేసివుండవచ్చు; కాని, తన స్థిరమైన వైరుధ్యాలను సడలించుకోవడానికి రామచంద్రారెడ్డి సిద్ధపడతారని భావించలేము.

***

జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిత్వ చివరి దశలో మొదలైన వేమారెడ్డి రామచంద్రారెడ్డి గారి అసంతృప్తి పర్వం ఇంకా సజీవంగానే వున్నట్లుంది. గూడూరు రాజకీయాల పెత్తనం విషయమై జనార్దనరెడ్డి చేసిన కొన్ని నిర్ణయాలు ఆయన్ను కష్టపెట్టినట్లున్నాయి. ఇంకా అలుక పాన్పు ఎక్కే వున్నారు. స్టేట్ కోపరేటివ్ బ్యాంక్ ఛైర్మన్‌గా తనను ఎంపిక చేయక పోవడం రామచంద్రారెడ్డి ప్రథమ కష్టం. గూడూరు రాజకీయాలలో తనను ప్రక్కన పెట్టి సమాంతర నాయకత్వాన్ని పెంచడానికి జరిగిన ప్రయత్నం రెండవ కష్టం. ఇరవై రెండేళ్ల స్నేహితుడిగా, సహచరుడిగా మెలగిన తనపట్ల, అధికారంలోకి వచ్చిన తర్వాత జనార్దనరెడ్డి సరైన గౌరవం చూపలేదన్నది మూడవ కష్టం. నిష్ఠూరాలు, నిందలతో వ్యక్తమౌతుండిన ఈ బాధ ఇటీవల ఇద్దరి మధ్య దూరం పెంచుతున్నట్లుంది.

ఎటొచ్చీ వీరిద్దరిదీ మొగుడు, పెళ్లాల సరసం, విరసం; అది నాలుగు రోజులు, ఇది నాలుగు రోజులు;

మిగతా 11 పేజీలో



# పినాకిని తీరం

### పత్రికలు తెరిస్తే సారాయి కంపు!

తెలుగు దినపత్రికలు తెరిస్తే సారాయి కంపుతో ముక్కులు పగిలి పోతున్నాయి. ఒక పత్రికలో అయితే చదవడానికి మరో వార్త వుండడం లేదు; అంతా సారాయి మయం! పూర్వం ఎక్కువ సర్క్యులేషన్ వుండే ప్రభ, పత్రిక, జ్యోతి వంటి వార పత్రికలకు కునేగా సెంటు పూసి పంపేవారు; ముక్కులు మూసుకోవలసి వచ్చేది. పత్రికల వారు పాఠకుల ఆకర్షణకో, తమ సరదాకో పత్రికలకు సెంటు పట్టించి పంపే వారు కాదు - ఆ కంపెనీ వారు తమ వస్తువు అమ్మకాలను పెంచుకోవడానికి ప్రకటనగా ఈ మార్గం అనుసరించే వారు. ఆ విధంగా ఇప్పుడు పత్రికలను సారాయిలో ముంచి పంపుతున్నారని కాదు గాని, పత్రిక ఆమూలాగ్రం అవే వార్తలయ్యే సరికి సారాయి కంపే అనిపిస్తున్నది; వికారం కలుగుతున్నది.

ఒక దినపత్రిక ఎప్పుడూ గాలి వాటంగా పయనిస్తుంటుంది; ప్రజల అభిప్రాయం ఎటువుంటుందో ఆ పత్రిక అదరువెత్తుకుంటుంది. దాని వల్ల రెండు ప్రయోజనాలు - ప్రజాభిమతానికి అద్దం పడుతున్నామని చెప్పుకోవచ్చు; ఆ కబుర్లతో నింపి పత్రిక వ్యాప్తిని పెంచుకోవచ్చు. ఈ ద్వివిధ లక్ష్యాలతో ఆ పత్రిక ముందుకు త్రోసుకొని పోతున్నది; తెలుగు దినపత్రికలలో అత్యధిక సర్క్యులేషన్ గలదిగా మొదటిదిగా నిలిచింది. పూర్వం పత్రికలను వున్నతా శయాల కోసం నడిపే వారు; ఈనాడు వ్యాపార దృష్టితో నిర్వహిస్తున్నారు. రెండవ రకం కోవకు చెందింది పైన పేర్కొన్న పత్రిక!

1982 నుండి కాంగ్రెస్ వ్యతిరేక వాతావరణం, ఎన్టీరామారావు పట్ల వున్న పిచ్చి సినిమా మోజుతో తెలుగుదేశం అనుకూల పవనాలు స్పష్టంగా గోచరిస్తుండినాయి. ఆ గాలి వాటాన్ని గ్రహించి ఈ పత్రిక విజృంభించింది; ఎన్టీఆర్ వాణి అయింది, తెలుగుదేశం జెండా పట్టుకున్నది. ప్రజల్లోకి చొచ్చుక పోయింది. ఆ ఎన్నికలలో ఆ పత్రిక ఎంత సాహసించిందంటే - ఎం.ఎల్.ఏ క్వార్టర్సు లోని కాంగ్రెస్ శాసనసభ్యులను పెట్టె బేడ సర్దుకొని ఇంటి దారి పట్ట మన్నది. అప్పుడు దాని మాట నిజమైంది; తెలుగుదేశం విజయఢంకా ఆ పత్రిక విజయఢంకా అయింది. అప్పటి నుండి ఆ పత్రికకు తన మాట వేదవాక్కుగా చలామణి అవుతుందనే నమ్మకం కలిగింది. ఏ సమస్య వచ్చినా, ఏ సంఘటన జరిగినా, ఏ ఎన్నిక సంభవించినా గోరంతలు కొండంతలు చేసి గందరగోళం సృష్టించడం ఆ పత్రిక పాలసీ అయిపోయింది. ప్రస్తుతం సారాయికి వ్యతిరేకంగా వుద్యమం లేదని కాదు, అందులో మహిళలు లేరని కాదు, ఆ వుద్యమం రాష్ట్ర వ్యాప్తం కాలేదనీ కాదు - కాని వుద్యమం పేరుతో అలజడిని, అశాంతిని, గందరగోళాన్ని సృష్టిస్తున్నది ఆ పత్రిక! సి.పి.ఎం. వల్లనో, మరో పార్టీ వల్లనో, రామారావు అసభ్య ప్రసంగాల వల్లనో కాదు ఈ దావానలం - ఆ పత్రిక పెట్టిన ప్రచార నిప్పు వల్లనే! సారాయి వుద్యమం ప్రతిపక్షాలది కాదు, ఆ పత్రికది! ఇందులో చిత్తశుద్ధి వుందో లేదో దేవుడికెరుక, మనకుకనపడుతున్నది సమయానుకూలత. గాలివాటం చూచి ఆ పత్రిక అందులో అవకాశవాదంగా దూరి సర్వం తాను కావడమే!

ఒక్క ఆ పత్రికేనా! తక్కిన తెలుగు పత్రికలన్నీ కూడా ఆ మార్గంలోనే పయనిస్తున్నాయి గదా అనవచ్చు. నిజమే, తెలుగు దినపత్రికల మధ్య పోటీ ఆ విధంగా వుంది. - ఒక దాని కంటె మరొకటి వెనుక బడగూడదనే పోటీ తత్వంతో పత్రికలూ తమ తమ వ్యక్తిత్వాలను కూడా విడనాడుతున్నాయి. ఒకదానికి మరొకటి నకిలీ అవుతున్నాయి. ఒక పత్రిక జిల్లా ఎడిషన్ ప్రారంభించే సరికి తక్కిన పత్రికలూ జిల్లా పేజీలు మొదలు పెట్టాయి. ఒకటి రెండు పత్రికలు మొదట ప్రారంభించిన పత్రిక వలెనే ప్రత్యేకంగా జిల్లా ఎడిషన్లు అందిస్తున్నాయి. సారాయి వుద్యమ ప్రచారంలో కూడా ఈ పోటీ ధోరణితోనే సారాయిలో మునిగి తేలుతున్నాయి; వెర్రిపట్టినట్లుగా వ్యవహరిస్తున్నాయి. తెలుగు దినపత్రికలు పాఠకులను ఆకర్షించడానికి తమ స్థాయిని ఎంత నీచంగా దిగజార్చుకోడానికైనా వెనుకాడడం లేదనడానికి ఒక ప్రత్యక్ష తార్కాణం; ఇటీవల ఒక దినపత్రిక తన ఆదివారం సంచిక తోటి ప్రచురించే వార పత్రికలో నెల్లూరు జిల్లాలోని ఒక దొంగ సారా తయారీ, రవాణా సామ్రాట్టు జీవిత చరిత్రను పదిపదిహేను బొమ్మల తోటి మూడు పేజీల కథగా ప్రకటించింది. ఆయన ఆస్తిపాస్తులు, ధైర్యసాహసాలు, అవధులెరుగుని ఔదార్య గరిమ, సామ్రాజ్య విస్తీర్ణం, ఆయన బాంబుల సంస్కృతి; తుపాకుల సాంప్రదాయం, ఆయన నిత్యకృత్యాలు .... అది అతని సంక్షిప్త జీవిత గాథ అనుకోండి! ఇక బొమ్మలంటారా - చెంబు పట్టుకొని బహిర్భూమికి పోవడం, ముఖ ప్రక్షాళన, స్నానం చేయడం, ధోవతి కట్టుకొని చొక్కా వేసుకోవడం వంటివి మినహాయిస్తే నిద్రలేచి కళ్లు నులుము కున్నది మొదలు ఆయన దిన చర్యలన్నీ పాఠకుల కళ్ల ముందు పెట్టారు. ఏ సారా వ్యతిరేకోద్యమానికి బాకా వూదుతున్నారో

కొరవ 11 పేజీలో

# జమీన్‌రైతు

## మంత్రి మండలి కుదింపు

రాష్ట్ర మంత్రివర్గాలను శాసన సభ సభ్యులసంఖ్యలో 10శాతానికి మించకుండా పునర్నిర్మించటానికి కాంగ్రెస్ అధిష్టానవర్గం నిర్ణయం తీసుకోవడం సంతోషదాయకం. దశాబ్దాల క్రింతం నుంచి చర్చలో వున్న సిఫార్సు ఇది. కాని ఏ ముఖ్యమంత్రి కూడా దాన్ని పాటించ లేక పోయారు. అసమ్మతి బెడద తప్పించుకోవడానికి, ఎమ్మెల్యేలను సంతృప్తి పరచడానికి ఎయిర్‌బస్ మంత్రివర్గాలను ఏర్పరచడం అనివాయితీ అయిపోయింది. ఒక్కొక్కసారి మంత్రులకు ఇళ్లు, కార్లు సమకూర్చి పెట్టడం కూడా అసాధ్యమయ్యే రీతిలో వుంటున్నాయి మన మంత్రి మండలులు. కాంగ్రెసే కాదు, తెలుగుదేశం వంటి ప్రతిపక్ష పార్టీలు కూడా 10శాతం పరిమితిని పాటించలేక పోయాయి. మంత్రుల సంఖ్య పెరిగే కొద్దీ, ఆ పదవికున్న గౌరవం, విలువ క్షీణిస్తున్నది. ప్రజలే కాదు- అధికారులు సైతం మంత్రులకు ప్రత్యేక గౌరవం ఇవ్వడం మానుకుంటున్నారు. ఇంకొక ప్రక్క మొదటి సారి గెల్చిన ఎమ్మెల్యేకి కూడా మంత్రి కావాలనే కోరిక. రాను రాను శాసన సభ్యత్వం అనేది ఒక పదవి క్రింద కాక, పై పదవులు పొందడానికి ఒక అర్హతగా మాత్రమే పరిణమిస్తున్నది. మంత్రిత్వం, కాకుంటే కార్పొరేషన్ ఛైర్మన్ గిరి సంపాదించడానికి ఎమ్మెల్యేలు పడే పాట్లు అన్నిన్ని కావు. ఈ ప్రయత్నాలలో వారు రాజధానికే పరిమితమై, నియోజక వర్గాలను వదిలేస్తున్నారు. ఇప్పటికైనా కాంగ్రెస్ అధిష్టాన వర్గం మంత్రుల సంఖ్యకు ఖచ్చితంగా పరిమితి విధిస్తే మంత్రి మండలుల పట్ల ప్రజలలో గౌరవం పునరుద్ధరింప బడుతుంది.

మన రాష్ట్రం వరకు చూస్తే ఇప్పటికే 32 మంది మంత్రులున్నారు. శాసన సభ్యుల సంఖ్య ప్రకారం 29 మందికి మించకూడదు. అంటే నలుగురు మంత్రులను వూడబెరకాలన్నమాట. త్వరలో మంత్రి వర్గాన్ని విస్తరిస్తామని చెప్తున్న విజయ భాస్కర రెడ్డి ఉద్వాసనలు చెప్పగలడా? సందేహమే! మంత్రి పదవుల కోసం ఆయనపై చాలా వత్తిడి వుంది. విశాఖ వంటి జిల్లాలకు అసలు ప్రాతినిధ్యమే లేదు. వైఎస్ రాజశేఖర రెడ్డి వర్గాన్ని పూర్తిగా విస్మరించి వున్నారు. ఈ సర్దు బాట్లకోసమైనా ఆయన మరి కొందరు మంత్రులను తీసుకోక తప్పదు. 10 శాతం పరిమితికి, ఈ వాస్తవ పరిస్థితులకు పొంతన కుదిరే అవకాశం కన్పించడం లేదు.

## జిల్లా ఎమ్మెల్యేల బాధ్యత

జనార్దనరెడ్డి ముఖ్యమంత్రిత్వ హయాంలో మొదలైన అభివృద్ధి కార్యక్రమాలను కొనసాగింపజేసే బాధ్యత ఇప్పుడు జిల్లా ఎమ్మెల్యేలపై పడింది. ఈ ఒకటిన్నర సంవత్సరంలో జిల్లాలో ఎన్నో కార్యక్రమాలు ప్రారంభించారు. దురదృష్టవశాత్తు వాటిలో ఏ ఒక్కటీ తుది రూపం సంతరించుకోక ముందే పరిస్థితులు తలక్రిందులైనాయి. ముఖ్యమంత్రి పదవి జిల్లాలో వున్నప్పుడు ఒక భరోసా- ఆలస్యం జరిగినా అనుకున్న క్షణంలో ఏ పనైనా జరిగిపోతుందని, ఒక్క కలం పోటుతో ఎంత మొత్తం నిధులైనా వస్తాయనే ఆశ వుండేది. ఇప్పుడు ఆ అవకాశం లేదు. ఈ మారిన పరిస్థితులలో జిల్లా అభివృద్ధి భారం ఎమ్మెల్యేలే తమ భుజాల కెత్తుకోవాలి. సోమశిల భూసేకరణ, పెన్నాడెల్టా ఆధునీకరణ, కృష్ణపట్నం థర్మల్ స్టేషన్, రేవు, నెల్లూరు బైపాస్‌రోడ్డు వంటి పనులన్నీ కాగితాలపైనే వున్నాయి. జనార్దనరెడ్డి ముఖ్యమంత్రిగా చేసిన దాదాపు 70 హామీలలో పూర్తయినవి ఏడెనిమిది మించిలేవు.

ఎన్నికలు కళ్లముందు కన్పిస్తున్నాయి. రెండేళ్ల సమయం త్రుటిలో గడచిపోతుంది. మళ్ళీ అవకాశం ఎవరికి వస్తుందో, ఎందరికి వస్తుందో చెప్పలేము. ఈ కొద్ది కాలంపాటైనా జిల్లాఎమ్మెల్యేలు రాజకీయాలు ప్రక్కన పెట్టి, అభివృద్ధి కార్యక్రమాలపైన దృష్టి కేంద్రీకరించడం వారికి, జిల్లాకు కూడా మంచిది. 89 ఎన్నికల తర్వాత కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో నెల్లూరుకు సంబంధించి చెప్పుకోదగిన అభివృద్ధి కార్యక్రమం ఏ ఒక్కటీ అమలు జరగలేదు. అన్నీ మాటల రూపంలోనే వున్నాయి. కృష్ణపట్నం రేవు వంటి పెద్ద పెద్ద విషయాలు వదిలేయండి- సోమశిల, బైపాస్‌రోడ్డు వంటి అత్యల్ప ఖర్చుతో జరిగే అత్యంత ప్రాధాన్యత కల్గిన పనులూ మూలపడి పోయాయి. ఈ పరిస్థితులలో ప్రతి కాంగ్రెస్ ఎమ్మెల్యే నిర్దిష్టమైన కార్యాచరణ ప్రణాళికతో, రాష్ట్ర ప్రభుత్వంపై సమష్టిగా ఒత్తిడి తెచ్చి, పెండింగ్‌లో వున్న కార్యక్రమాలన్నింటినీ ఈ రెండేళ్లలో పూర్తి చేయించగల్గితే- పదకొండు మందిని గెల్పించడం ద్వారా కాంగ్రెస్ పట్ల జిల్లాప్రజలు ప్రదర్శించిన విశ్వాసాన్ని నిలబెట్టుకున్న వారౌతారు;

## జమీన్‌రైతు

[జమీన్‌రైతు స్థాపకుడు స్వర్గీయ రామానాయుడు గారు విమర్శించ దలిస్తే యముడికీ, శివుడికి వెరిచేవాడు కాదు; ఎంతటి ఉన్నతి స్థానంలో వున్నవారినైనా ఏకి పారేసేవాడు. అనాడు తిరుగులేని అధికారంతో చలామణీ అవుతుండిన ప్రకాశం పంతులు గారిని ఎట్లా చీల్చి చెండాడాడో చూడండి - 17.10.47 సంచిక నుండి]

### ఆంధ్ర రాజకీయాలు

చిత్రగుప్తుడు

"చెట్టు ముదిరెనేని
చెడు పండె లొదవురా!
విశ్వదాభివేమ
వినర రామ"

ప్రకాశం పంతులు మొన్న గాంధీమహాత్ముని జన్మోత్సవ సందర్భంలో రేడియోలో మాట్లాడుతూ " స్వరాజ్యం ఒక్క గాంధీ వల్లనే రాలేదు. ప్రజల వల్ల వచ్చింది" అన్నాడు. అంటే అచ్చం గాంధీవల్ల రాలేదు. తన వల్ల గూడా వచ్చిందని తెలుగర్థం.

"రామాయణ యుద్ధం, సీతా నిర్బంధ విమోచనం రాములవారి వల్ల జరగలేదు. కోతి మూక వల్లనే జరిగింది" అని తాత్పర్యం.

ఒకనాడు "నీవే తప్పని నితఃపరం బిరుగుము" అనడం. మరొకనాడు "నీదేమున్నది? నామమాత్రమె గదా?" అని పరిహసించడం పంతుల పదవీవ్యామోహ నైరాశ్యాధ్యాయంలో యిట్టివెన్నో.

నిజంగా గాంధీగారికంటె పంతులే అధిక్యుడని చెప్పవచ్చు. ఏమంటె గాంధీ గారి పెద్దకొడుకు ఇస్లాం మతంలో మాత్రమే చేరాడు. పంతులు కుమారుడో యింగ్లండులో మతంలో చేరకుండానే ముస్లిం స్త్రీని పెండ్లాడాడు. ఆమె సంపూర్ణ గర్భవతి గూడా. రేపో ఎల్లుండో ముస్లిం మనమణ్ణి పంతులు ఎత్తి ముద్దాడే రోజులు కూడా వస్తున్నవి కాబట్టి ఒక్క గాంధీగారికే ఆధిక్య మివ్వడం పంతుల కిష్టపడకపోవడం సహజమే.

### పాత సంపుటాల్లో.....

* * *

మనుజాలు పొడుగైతే
మనసులు పొడుగులా?
విశ్వదాభి వేమ
వినరరామ

తత్ నైరాశ్య శిష్యుడు మామిడిపూడి వెంకట రంగయ్య గారు 10 తేది ఆంధ్ర రాష్ట్ర సభాసందర్భంలో నెల్లూరులో మాట్లాడుతూ "స్వరాజ్యం గాంధీవల్ల, కాంగ్రెస్ వల్ల, ఖద్దరు - రాట్నాల వల్ల, సత్యాహింసల వల్ల, సత్యాగ్రహాల వల్ల రాలేదు బ్రిటిష్ వారి వివ్శుల వల్ల, పరదేశీయుల ఒత్తిడి వల్ల వచ్చింది" అన్నారు.

అంటే తనకు ఆంధ్ర యూనివర్సిటీ వైస్ చాన్సలర్ పదవి గూడా యివ్వలేకపోయిన యీ కాంగ్రెస్ స్వరాజ్యం మాత్రం తేగలగడానికి తాహతు వున్నదా అని పంతుల శంకకాబోలు!

కాంగ్రెస్ త్యాగ యజ్ఞంలో తనుగాని, తన కుటుంబంగాని సమిధ పుల్ల గూడా వేయని, వేయను చేతగాని, ధైర్యం లేని, ఆ అదృష్టానికి నోచుకోని విద్యాధికుడనే గర్వంతో విర్రవీగి పొయ్యే యీ మహాశయుడు కాంగ్రెస్ యొక్క, గాంధీ మహాత్ముని యొక్క, త్యాగ శక్తి సామర్థ్య విశేషాలు ఎట్లా గమనించ గలరులెండి!

లెక్చర్లు కొట్టడం కంటె పూచిక పుల్లైనా దేశం కొసరం, అందులోకి ఆంధ్ర మాతృ భూమి కొసరం పనిజేయని, చేయ నొగసని, యీ మహానుభావుడికి ఒడ్డు పొడుగు జూచి, ఆచార్య బిరుదును జూచి, వైస్ చాన్సలర్ పదవితో వీరిని పూజించ లేదని కాంగ్రెస్ మీద అలక కాబోలు!

నవ్య భావ ప్రపంచ నిర్మాత అని కలలో అనుకొనే ఈ రాజకీయ విజ్ఞుడు జమీన్దారీలతో పాటు యినాములను రద్దు జేయగూడదనడంలోనే వీరి వుదారాశయం లోకానికి బోధ పడింది. ఇలాంటి భౌతిక హేతువాద నిపుణుల కెట్లా తెలుస్తుంది లెండి, ఆధ్యాత్మిక శక్తి సంపన్నుడైన గాంధీ మహాత్ముని తపోమహిమ ప్రభావం.

# పిసిసికి అర్హత కలిగినవారు జిల్లాలో ఇంకెవ్వరూ లేరా?

ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీలో జిల్లానుండి ఎంపిక చేసిన వారి పేర్లు విని ఆశ్చర్యపోవలసి వచ్చింది. జిల్లా నుండి ఎంపిక చేసిన నలుగురిలో ఇద్దరు హరిజనులైతే, తక్కినిద్దరు రెడ్డి ప్రముఖులు; వీరందరూ ప్రస్తుతం ఏదో ఒక పదవిలో వున్నవారే. అందులో ముగ్గురికి ఎన్నికైన పదవులుండగా మరొకాయనకు ఆశ్రయ పదవి. ఈ ఆశ్రయ పదవి గల వ్యక్తి నెల్లూరులో ఎంతమందికి తెలుసు. అసలు ఎప్పుడైనా ఆయనగారు జిల్లా కాంగ్రెస్ పార్టీ సమావేశానికి హాజరయ్యారా? కార్యవర్గానికి ఎంపిక కాబడే సత్తాగల సభ్యులే జిల్లాలో కరువయ్యారా? కోశాధికారిగా ఎంపిక చేసిన శ్రీమాగుంట సుబ్బరామరెడ్డి పదవికి తగిన వ్యక్తి! శ్రీ పట్రా ప్రకాశరావుకు ఇప్పటికే ఉన్న రెండు పదవులతో సమయం చాల అల్లాడి పోతుంటె మూడవ పదవి ఎందుకు? కుమారి పద్మశ్రీ రాజకీయాల్లో జూనియర్; పదవులు పొందే సమయం ఇంకా ముందుంది. ఏది ఏమైనా ఈ కార్యవర్గం జిల్లా కాంగ్రెస్ కార్యకర్తలకు ఆమో యోగ్యం కాదు!

-టి.వి.నారాయణ

నెల్లూరు.

### ఉత్తమాటలు తగవు

శ్రీ రామారావు తమ తెలుగు దేశం పార్టీ అధికారంలోకి వస్తే కిలోబియ్యం మళ్లీ 2రూపాయలకే ఇస్తానని, సారాయిని నిషేధిస్తానని ప్రగల్భాలు పలకడం మొదలెట్టారు. ఈ రెండు పథకాలు అనువర్తింప జేయను రాష్ట్రం ఆర్థిక పరిస్థితి ఏమిటన్న విషయం ఆయన ఆలోచించడం లేదు. చరిత్ర ప్రసిద్ధి గాంచిన ఔరంగజేబు పరిపాలనలో విధించిన పిచ్చిపన్నుల్లా ఎన్టీఆర్ గారు కూడా భార్యతో సంసారం జేసే వారికి పన్ను, ప్రేమించే వారికి పన్ను, ఇల్లు కట్టనివారికి పన్ను, వళ్లుండే వారికి పన్ను వంటివి విధిస్తారేమో మరి! ఆచరణ యోగ్య విషయాలు మాట్లాడండి; ఉత్తమాటలు మానండి.

- పి. అరుణమ్మ

నెల్లూరు.

## జనవాణి

### సెక్స్-వయొలెన్స్‌వ్యతిరేక ఉద్యమం లేవదీయాలి!

నేడు తెలుగు సినిమాల్లో శృతి మించిన శృంగారం, ఒళ్లు జలదరించే హింస, పసిపిల్లలు కూడా అసహ్యించుకొనే ద్వంద్వార్థపు సంభాషణలు వీర విహారం చేస్తున్నాయి. వెంటనే వీటికి సెన్సార్ ఫుల్ స్టాప్ పెట్టక పోతే సారా వ్యతిరేక ఉద్యమంలా సెక్స్-వయొలెన్స్ వ్యతిరేక ఉద్యమం లేవదీయవలసి వస్తుంది. ఆంధ్రప్రదేశ్ జనాభాలో మూడొంతులకు పైగా నిరక్షరాస్యులు;వీరికి సినిమా తప్ప ఇతర వినోద కాలక్షేపం మరొకటి లేదు. కాని సినిమా చూద్దామంటె అసభ్యత, హింస తప్ప మరొకటిలేదు. ఈ అంశాలనే సాధ్యమైనంత ఎక్కువ చూపి సినీ జీవులు సొమ్ము చేసుకొంటున్నారు. అదేవిధంగా ప్రజా స్వామ్యాన్ని పరిహసించి చూపించే సన్నివేశాలు ఎక్కువైపోయాయి. సాహిత్యం మరీ దిగజారి పోయింది. ఈ విషయమై ప్రభుత్వమే ఆలోచించి సెన్సార్ వ్యవస్థను పటిష్టం చేయాలి. లేకుంటే సమాజంలో పలు రుగ్మతలు తీవ్రమై పతనం అంచుకు పోతుంది.

ఎన్.ప్రకాశ్‌బాబు

సూళ్లూరుపేట.

### సరదాలు కాదు సమస్యలు చూడండి

ఇంటింటికో కలర్ టి.వి. పథకాన్ని ప్రారంభించ నున్నట్లు మంత్రి శ్రీ సంతోష్ రెడ్డి వెల్లడించారు.

తరువ 10 పేజిలో

# పొదలకూరు రోడ్డును తాత్కాలిక బైపాస్‌గా మార్చకూడదా?

బైపాస్ రోడ్డుకు ఇక ఎప్పటికి మోక్షం? జగదీశ్ టైట్లర్‌తో స్నేహం కల్గిన జానకిరాంకు ఏనాడి మంత్రిత్వంలో ఆ విషయం చూడడానికి తీరిక చిక్కలేదు; ముఖ్యమంత్రిగా శ్రీ జనార్ధన రెడ్డి నెల్లూరు పౌరులపై కరుణ చూపలేదు. చిన్నచిన్న ఊళ్ళు, పట్టణాలకు ఎప్పటి కప్పుడు బైపాస్‌లు ఏర్పడుతున్నాయి; గుంటూరు వంటి మహానగరానికి కొత్త బైపాస్ ఏర్పడింది. ట్రాఫిక్ రద్దీ తగ్గించడానికి కృష్ణ గోదావరిలపై అదనంగా బ్రిడ్జిలు కడుతున్నారు. కాని నెల్లూరుకే ఏ గతీ లేదు. ఏమి పాపం చేసుకున్నామో మనం - ఒక్క నాయకుడికీ టౌన్‌ను కలిచివేస్తున్న ఈ సమస్య పైన శ్రద్ధ కలగడం లేదు. పదవులెక్కడానికి, పదవుల్లో వున్నవారిని దించడానికి తమ జీవితాలను అంకితం చేయడం తప్ప ఎవరికీ ప్రజలంటే, ప్రజల బాధలంటే పట్టడం లేదు.

ఆ సోది వదిలేయండి - నెల్లూరుకి ఇక ఇప్పట్లో బైపాస్ రోడ్డు వచ్చే అవకాశం లేదు. ఆ కోరిక తీరాలంటే మరొక తరం గడవాలి. అది తీరేలోగా ఆ బైపాస్ రోడ్డు కాస్త టౌన్ ఇంటర్నల్ రోడ్డుగా మారి పోవడం ఖాయం. అది వచ్చేనంత వరకు టౌన్‌కు వున్న ఒకే ఒక ట్రంకురోడ్డును సైకిళ్ల నుంచి 40 టన్నుల లారీల వరకు వాడి పౌరుల ప్రాణాలు తీయడం అన్యాయం. ఆత్మకూరు బస్టాండు నుంచి అయ్యప్ప దేవాలయం వరకు ట్రంకురోడ్డు పై కాలు పెట్టడం మృత్యుగుహలో అడుగు పెట్టడం గానే వుంది. ఈ ఆరేడు కిలోమీటర్ల దూరం రోడ్డు రక్తంతో తడవని రోజు లేదు. టౌన్ బస్సుల్లో, లారీలో ప్రతి దినమూ ఒక ప్రాణాన్ని పొట్టన పెట్టుకుంటున్నాయి. ఇంకొక ప్రక్క రోడ్డు పై వాహనాలు నడవడం, నడపడం దుస్తరంగా వుంది. ఎప్పుడో వచ్చే బైపాస్ రోడ్డు కోసం ఎదురు చూస్తూ ఇప్పుడు టౌన్ వాసులను ఇంత ఘోరంగా

## సింహపురి

శిక్షించడం న్యాయం కాదు. మునిసిపల్ అధికారులు, ఆర్‌టిఓ, కలెక్టరు, పోలీసులు సంయుక్తంగా ఆలోచించి ప్రత్యామ్నాయ మార్గాలు అన్వేషించాలి.

పొదలకూరు రోడ్డు ఈ విషయంలో కొంత వరకు ఉపకరించవచ్చు. ఆటోనగర్‌ను అనుకొని వేర్ హౌస్ గోడౌన్ల మీదుగా పొదలకూరు రోడ్డులో కలిసే రోడ్డు ఒకటి వుంది. ఆ రూట్‌లో, లారీ ట్రాఫిక్‌ను మళ్లించి, మూలపేట వాటర్ వర్క్స్, పాత పెద్దాస్పత్రి, సంతపేటల మీదుగా ఆత్మకూరు బస్టాండ్‌కు ట్రాఫిక్‌ను నడిపితే టౌన్‌లో ఇరుకు తగ్గుతుంది. పొదలకూరు రోడ్డు చాలా విశాలమైనది. రాష్ట్ర ప్రభుత్వ ప్రత్యేక నిధుల పై ఆధారపడకుండానే స్థానికంగా రోడ్లు భవనాల శాఖ ఈ రోడ్డును అభివృద్ధి పరచవచ్చు. పెద్ద ఖర్చు కాదు. పైగా చెప్పుకోదగిన ఆక్రమణలు లేవు; సాధారణ ట్రాఫిక్ కూడా తక్కువ. కలెక్టర్‌గారు ఆలోచించాలి.

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాల సందర్భంగా 1 తేది నెల్లూరు చరిత్రకారుడు ఎస్‌ఎస్ కృష్ణమూర్తిని సన్మానిస్తున్న బెజవాడ గోపాలరెడ్డి; ప్రక్కన ఆర్‌డిఒ సత్యప్రసాద్, రచయిత గ్రిద్దలూరు గోపాలరావు.

### ఆంధ్రప్రదేశ్ ఉత్సవం

రాష్ట్ర అవతరణ దినోత్సవం జిల్లా సాంస్కృతిక మండలి ఆధ్వర్యాన నవంబర్ 1తేది కస్తూర్బా కళా క్షేత్రంలో ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి మాట్లాడుతూ ఆంధ్ర రాష్ట్రం కోసం ప్రాణ త్యాగం చేసిన శ్రీ పొట్టి శ్రీరాములు మన జిల్లావాడు కావడం గర్వించ తగ్గ

కొరవ 10 పేజీలో

★★★★★★★★★★

### ఆహ్వానం

జయంపు కృష్ణ

ఆరోజుల్లో అనుకున్నారు
ఆతరువాత ఎవరున్నారు?
చెట్టు పేరు చెప్పుకుని కాయలు
అమ్ముకునే దశలోనే వున్నారు-
ఎవరి నోటవిన్నా ఒకేపాట
ఆచరణలోనే తలా ఒకబాట
మత్తుగమ్మత్తుపై మగువలంతా
సిద్ధమై యుద్ధం ప్రకటించారు
మీ ఆశల శ్వాసల పర్వానికి
స్వరాలు సరి చేస్తున్నారు-
'ప్రాక్టిస్ బిఫోర్ యుప్రిచ్'
మీ బలమైన, బరువైన ఉవాచ
ఆనాడు మీరు మా నిజమైన నేత
అందుకే మాకు అందింది స్వేచ్ఛ
ఈనాడు అన్నీ నేతిబీరకాయలే
నీతులు వల్లించే మేకవన్నె పులులే
మత్తులోకి మతంలోకి ప్రజలు
బలవంతంగా లాగ బడుతున్నారు
బలహీనంగా నీరసించి పోతున్నారు
ఈ ఉరుకులు పరుగులు ఏవైపుకి?
ఈ దశలో
నారీలోకం నారి పూరిస్తోంది
సారాపై సమరభేరి మోగిస్తోంది
అన్ని అనర్థాలకు , అమానుషాలకు
మనల వీడని మత్తే కారణమని
వదలకుంటె మరణమే శరణ్యమని
మనజాతి మనగడ దారుణమని
ఎలుగెత్తి చాటుతోంది; వెల్లువై
ముందుకు దూకుతోంది; సాగుతోంది
బాపూ-
ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు మళ్ళీ ఓసారి
మీ హృదయ స్పందనకు
ప్రతిస్పందన
మీ సజీవ సందేశానికి సాకారం
ఈ ఉద్యమానికి అందరి ఆహ్వానం-

★★★★★★★★★★

## సణుగుడు

* కాంగ్రెస్ ప్రభుత్వంలో కాంగ్రెస్ కార్యకర్తలపై కేసులుండడం అధర్మం!

* అన్నగారిని బస్ టిక్కెట్ అడగడానికి ఎంత ధైర్యం?

రాజీవ్ గాంధీ హత్యానంతర అల్లర్లతో ప్రమేయమున్న కాంగ్రెస్ కార్యకర్తలందరి పైనా కేసులు వుపసంహరిస్తూ రాష్ట్ర మంత్రి వర్గం తీర్మానం చేసింది, తెలుసా?

అవును మరి, కాంగ్రెస్ కార్యకర్తలపైన కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో కేసులు నడవడం అధర్మం కదా!

వాళ్ళు చేసిన అకృత్యాల సంగతో!

పాపం, వారు చేసినవి పెద్ద తప్పులా? రాజీవ్ చితిమంటల వెలుగు దేశమంతా కన్పించదు కాబట్టి, అక్కడక్కడా వాలుగు ఇళ్లు తగులబెట్టి, ప్రజలకు ఆ మంటలు చూపించారు; నాయకుడి వియోగదుఃఖం భరించలేక కొల్లగొట్టిన బ్రాందీ షాపులలోని సీసాలతో బాధ మరచి పోయే ప్రయత్నం చేశారు; బందుల వల్ల చిల్లర సామాను దొరకదని భావించి అంగళ్లలోని సరకులు తమ ఇళ్లకెత్తుక పోయారు; తమ నాయకుడిపై అవాకులు, చెవాకులు పలికిన ప్రతి పక్షపార్టీలకు బుద్ధి చెప్పడానికి వారి ఇళ్లు తగుల బెట్టారు. ఇవి పెద్ద తప్పులా? అందుకు వారిపై కేసు పెట్టడమా? తప్పు కదూ!

అదే పేవాతో, రాజంపేట అటవీ అధికారులను కొట్టి, స్మగ్లింగ్ లారీలను విడిపించుక పోయిన మాన్యమంత్రి దివాకర రెడ్డి సోదరుడిపైనా కేసు రద్దు చేసివుంటే ఇంకా భేషుగ్గా వుండేది కదా?

ఆ కేసు రద్దు చేయడమే కాదు, మంత్రిసోదరుడిపై కేసు పెట్టే సాహసం చేసిన అధికారులను ఉద్యోగాల నుంచి ఊడబెరకడమో లేక, ఉన్నపళంగా బదలీ చేయడమో చేస్తే కాంగ్రెస్ పార్టీకి మరింత గొప్ప సేవ చేసిన వారౌతారు. మంత్రిగారి స్మగ్లింగ్ లారీలను పట్టుకోవడానికి వారికెంత ధైర్యం? అది రాజంపేట కాబట్టి సరిపోయింది కాని, తాడిపత్రి అయితేనా- ఒక్క గుండుకు ఇద్దరి లెక్కన లేపిపారేసివుండేవారు. రాను రాను మన అధికారులు మరీ బరితెగించి పోతున్నారు. మంత్రిగా వుండేవారు స్మగ్లింగ్ చేయకుంటే, దొంగసారాయి వండకుంటే, నాలుగు చేతులతో సంపాదించకుంటే తోటి మంత్రులదగ్గర చిన్నతనం కాదూ!

అసలు ఏ అర్థనా లేకుంటే మంత్రిపదవు లెందుకు చెప్పండి? దిపంపున్నప్పుడే నాలుగు కాసులు సర్దుకోకుంటే రేపు ఎన్నికల్లో సారాయి పొట్లాలకు, నాటు బాంబులకు, రిగ్గింగు కాంట్రాక్టులకు డబ్బెవడిస్తాడు మరి? అధికారులుకు ఆ మాత్రం తెలియదా చోద్యం కాకుంటే!కావాలంటె పదిరూపాయలు మామూలు అడిగి తీసుకోవాలి కాని, ఏకంగా లారీలే పట్టేస్తారా? వారిని అదిలాబాద్ అడవులకు బదలీ చేయక పోవడం కాంగ్రెస్ ప్రభుత్వ ఉదారతగా భావించాలి!

ఇటువంటి తప్పులు చేసే అధికారులను ఏ రాజకీయ పార్టీ క్షమించదు. తెలుగు నేత చంద్రబాబు నాయుడుగారు అందుకే కదా తాము అధికారంలోకి రాగానే తనకు బస్సు

### డోలేంద్ర

ఇవ్వనన్న ఆర్‌టిసి ఉద్యోగి అంతుచూస్తానని హెచ్చరించింది.

సాక్షాత్తు అన్నగారు వచ్చి బస్టాండులో నిలబడితే, డబ్బు కట్టనిదె బస్సు ఇవ్వనని రూల్సు మాట్లాడ్తారా, ఎంత ధైర్యం? హైకోర్టు తీర్పులకే అతీతమైన నాయక శ్రేష్ఠుడు ఆర్‌టిసి బస్సెక్కి టిక్కెట్ డబ్బు కడ్తారా? అసలాయన దగ్గర డబ్బెక్కడుంది పాపం? అధికారం పోయి మూడేళ్లు గడచిపోయె; అర్థనిచ్చే సినిమాలు వానకు తడిసిన దీపావళి టపాసుల్లాగా తుస్సుమంటుండె; ముఖ్యమంత్రి పదవైనా వుంటె ఎన్నికల నిధులనో, జనవతారకం అన్నత్రకీ విరాళమనో అభిమానులు నాలుగ రూకలు చేతిలో పెట్టి పోతూండేవారు; పైల్ల పరిష్కారంలో అల్లుడుగారు చిల్లర కూడ బెట్టుండేవారు; ఇప్పుడు అధికారమూ లేదు, ఆదాయమూ లేదు- సన్యాసి దగ్గర టిక్కెట్‌కు డబ్బెక్కడ నుంచి వస్తుంది?

అసలు -సాధారణ ప్రయాణీకుడికి అన్నగారి వంటి సర్వసంగ పరిత్యాగులు, బూడిద మాత్రం బస్తాల్లో నింపుకున్నవారు అల్లుళ్ళు , కొడుకులకు ఆస్తులు సంపాదించి పెట్టడం తప్ప తనకంటూ చిల్లి గవ్వ మిగల్చుకోనివారు.

కొరవ 8 పేజీలో


జవహార్ రైతు నూతన భవన ప్రారంభోత్సవ సభలో ఎమ్పీ కుమారి కె.పద్మశ్రీ, మంత్రి పసల పెంచలయ్య, శ్రీమతి నేదురు మల్లి రాజ్యలక్ష్మి, జనార్దన రెడ్డి, మాగుంట సుబ్బరామి రెడ్డి, ఎనుగు సీతారామి రెడ్డి, నెల్లూరు శ్రీరామమూర్తి

# 'పార్టీ ప్రతిష్ట కోసమే త్యాగం చేశాను'

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి రెండు రోజుల జిల్లా పర్యటన దిగ్విజయంగా జరిగింది. ప్రజల సంగతి ఏమో కాని, కాంగ్రెస్ కార్యకర్తలు,నాయకుల వరకు జనార్దనరెడ్డిని - ముఖ్యమంత్రిగానే చూస్తున్నారు; పదవిలో లేదన్న సంగతే వారికి గుర్తుకు రావడం లేదు. వెంకటగిరి

> 'స్వర్గీయ బాలకృష్ణారెడ్డి కన్న కలలు తీర్చడానికి అప్పుచేసి మెడికల్‌కాలేజి పెట్టబోయాను'

నుంచి నెల్లూరు వరకు జరిగిన సభలన్నీ ఆ కోవలోనే జరిగాయి. కార్ల బార్లు, సెక్యూరిటీ పోలీసుల హడావుడి, అధికార్లు వెంటనే వుండటం తదితరాలు కూడా జనార్దన రెడ్డి పదవీ పరిత్యాగాన్ని మరుపుకు తెచ్చాయి.

విచిత్రమేమిటంటే, పదవిలో వున్నప్పటి కంటే లేనప్పుడు జరిగిన ఈ సభలకే అధిక సంఖ్యలో జనం రావడం. వెంకటగిరి సభకైతే జనం వెల్లువెత్తిగా వచ్చారు. కుండపోతగా వాన కురిసినా ఒక్కరూ కదలలేదు. వెంకటగిరిలో ఆ రోజు తిరునాళ్లు జరిగినట్లు వుండింది. టౌనంతటినీ కాంగ్రెస్ జెండాలతో అలంకరించారు. కార్లబారు కిలోమీటరు వుంటుందన్పించింది. దారి పొడవునా కార్యకర్తలు పూలజల్లులు కురిపించారు.

మొదటి సభ - హ్యాండ్ ల్యూమ్ టెక్నాలజీ భవన ప్రారంభోత్సవం. మంత్రులు పసల పెంచలయ్య, డికె సమర సింహారెడ్డి, పి. జనార్దన రెడ్డి, జెసి దివాకర రెడ్డి, పాటి రాజం, ఛీఫ్ విప్ నన్నపనేని రాజకుమారి తదితరులంతా హాజరైనారు. దేశంలోనే ఇటువంటి సంస్థలు మూడంటే మూడున్నాయట; ఇది నాలుగవది. 27 లక్షలతో దీనికి భవనం నిర్మించారు. ఇక్కడ 27 మంది

## జిల్లాలో జనార్దన రెడ్డి

విద్యార్థులకు వస్త్ర పరిశ్రమలో ఆధునిక రీతులపై శిక్షణనిస్తారు. తర్వాత 132 కెవిఎ సబ్ స్టేషన్ ప్రారంభోత్సవం. వెంకటగిరి ప్రాంతంలో దీనితో లోఓల్టేజి సమస్య తీరిపోతుంది. 110 ఎకరాల స్థలంలో నిర్మించనున్న విశ్వోదయా

> 'అధిష్టానవర్గం నన్ను రాజీనామా చేయమనలేదు, నేనే చేశాను'

కాలేజి నూతన భవన నిర్మాణానికి శంకుస్థాపించారు. ఈ సముదాయం ఖర్చు అంచనా రెండు కోట్ల 50 లక్షలు. ఇవికాక బాలుర ఐటిఐ, 22 పడకల ఆస్పత్రి, భవనాలు, 14 కోట్ల వ్యయం కాగల రోడ్డు పనులు తదితరాలకు శంకుస్థాపించారు. ఇవన్నీ జనార్దన రెడ్డిగారు ముఖ్యమంత్రిగా చేసిన వాగ్దానాలు.గూడూరు వెంకటగిరిల మధ్య నడిచే కొత్త బస్‌కు రైట్ రైట్ చెప్పారు. ఇది శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ కార్యక్రమం.

సాయంత్రం పెద్ద ఊరేగింపు, బహిరంగ సభ. వెంకటగిరి ఇరుకు రోడ్లు జన సముద్రాలే అయ్యాయి. సభలో జనార్దన రెడ్డి మనసు విప్పి మాట్లాడారు. కోర్టులకు, ప్రతిపక్షాలకు భయపడి కాక - వెంకటగిరి ప్రజల ప్రతిష్ట పెంచడానికే రాజీనామా చేశానని చెప్పారు. పదవి లేకున్నా వెంకటగిరి ప్రజలకు సేవచేస్తానని హామి ఇచ్చారు. మెడికల్ కాలేజి విషయంలో తన పై అనవసరంగా నిందలు వేస్తున్నారని; స్వర్గీయ బాలకృష్ణారెడ్డి కన్న కలలు నెరవేర్చాలనే ఉద్దేశ్యంతో , అప్పులు చేసి మెడికల్ కాలేజి పెట్టను సిద్ధమైనానే తప్ప , డబ్బుకోసం కాదని, కాని గిట్టని వారు దానికి పెడార్థాలు తీస్తున్నారని చెప్పారు జనార్దన రెడ్డి గారు. ధనార్జన కోసం తామెప్పుడూ విద్యా సంస్థలు నడపలేదన్నారు.

బహిరంగ సభకు హైలైట్ - నన్నపనేని చతురోక్తుల ప్రసంగం. మంత్రి పంచకం, ఇతర వక్తలు యధారీతి జనార్దన రెడ్డి పదవీ పరిత్యాగం పట్ల ఆవేదన వ్యక్తం చేశారు.

> 'తిరుగుబాటు చేస్తే సమర్థిస్తామని ప్రతిపక్షపార్టీ ఒకటి ఆశ చూపింది'

31 తేది ఉదయం వాకాడులో ఐటిఐ శంకుస్థాపన. సాయంత్రం నెల్లూరు జవహార్‌రైతు నూతన భవన ప్రారంభోత్సవం; తర్వాత

కొరవ 8 పేజిలో

# పెంచలయ్యగారూ - మీరైనా వాగ్దానాలు మానండి!

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య అక్టోబర్ 30 తేది నుండి నవంబర్ 4 వరకు జరిపిన ఆరురోజుల జిల్లా పర్యటన విజయ వంతంగా ముగిసింది. వెంకటగిరిలో 30 తేది మాజీ ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డితో పాటు ఊపిరిసలుపను సమయం లేని కార్యక్రమాలతో మొదలై వాకాడు, నెల్లూరు, సూళ్లూరుపేట నియోజ క వర్గాల్లోని పలు గ్రామాల సందర్శనలో ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలతో ముగిసిన మంత్రి పర్యటన పసందుగా సాగింది. సూళ్లూరుపేట , నాయుడుపేట గ్రామాల్లో జరిగిన సభల్లోఅక్కడి ప్రజలు మంత్రికి బ్రహ్మరథం పట్టారు. చిట్టమూరు మండలం గతుకులు, బురద పట్టిన రోడ్లపై మంత్రి నడిచి వెళ్లి అక్కడి ప్రజల అభినందనలు అందుకున్నారు. కుదుకొండ గ్రామంలో ప్రతిపక్షాలు చిన్న ప్రహసనం సృష్టించినా మంత్రి, ఇతర ప్రముఖులు చాకచక్యంగా సర్దారు. 31తేది వాకాడు ఐటిఐ ప్రారంభోత్సవ కార్యక్రమంలో మాజీ ముఖ్యమంత్రి శ్రీజనార్దనరెడ్డితో కలిసి పాల్గొన్నారు. 1 తేది సూళ్ళూరు పేటలో ఏర్పాటైన బహిరంగ సభలో మంత్రి మాట్లాడుతూ డిగ్రీ కళాశాల తెస్తానని వాగ్దానం చేశారు. తీర ప్రాంతం గ్రామాల్లో విద్యుత్ సౌకర్యం కల్పించను ప్రభుత్వం కోటి రూపాయలు మంజూరు చేసిందని, పనులు చేపట్టవలసిన జాబితాలో జిల్లాలోనివలు రీవులున్నాయని చెప్పారు. ఆర్టీసి బస్ డిపో, స్టేషన్‌ల ప్రతిపాదనల చిక్కుముడి వీడినట్లు వివరించారు. సాయంత్రం నియోజక వర్గంలో చేపట్టవలసిన అభివృద్ధి పనులపై జిల్లా అధికారుల సమీక్షా సమావేశం జరిపారు. జిల్లా కలెక్టర్ శ్రీ.ఎం.సాంబశివరావు , జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర ఇతర అధికారులు సమావేశంలో పాల్గొన్నారు. రాత్రి నాయుడుపేటలో బహిరంగ సభ, రాఘవ, సర్వేపల్లి ఎమ్మెల్యేలు కూడా హాజరయ్యారు. స్థానిక నాయకులు వరలవాడ కృష్ణమూర్తి మాత్రం గైరహాజరైనారు. పాత స్పర్థలు ఇప్పటికైనా సమసిపోవడం ఇద్దరికి మంచిది కాదా?2 తేదిచిట్టమూరు పర్యటన మాజీ మండలాధ్యక్షుడు శ్రీచిట్టిబాబు ఆడంబరంగా ఏర్పాటు చేశారు. మల్లాం మంచినీటి పథకంకు ఉద్దేశించిన నీరు ఉప్పగా మారడంతో మంత్రి రాష్ట్ర ప్రారంభించలేదు. మావిళ్లపాడులో హౌసింగ్ బోర్డు కాలనీకి శంకుస్థాపన చేశారు. 3 తేది 30 గ్రామాల మంచినీటి సరఫరాకు ఉద్దేశించిన రామాపురం పథకంతోపాటు, ప్రపంచ బ్యాంకు నిధులతో జరుగుతున్న పనులు పరిశీలించి త్వరిత గతిన పూర్తిచేయమని అధికారులను ఆదేశించారు. 4 తేది జిల్లా

> పసందుగా సాగిన పెంచలయ్య తొలి జిల్లా పర్యటన

సమీక్షా సమావేశంలో పాల్గొని మధ్యాహ్నం పాత్రికేయులకు మంత్రి 'లంచ్' ఏర్పాటు చేశారు. అభిమానులు, పార్టీ కార్యకర్తలతో గడిపి రాత్రి నారాయణాద్రికి హైదరాబాద్ బయలు దేరి వెళ్లారు. రైల్వే స్టేషన్‌లో మాజీమంత్రి, శ్రీనల్లపు రెడ్డి శ్రీనివాసులురెడ్డి కనపడగా మంత్రి వెళ్లి కరచాలనం చేసి సభ్యత చాటుకున్నారు. ఒంగోలు ఎమ్పీ శ్రీమాగుంట సుబ్బరామిరెడ్డి, నెల్లూరు ఎమ్పీ కుమారి


సూళ్లూరుపేటలో టెక్నికల్ ట్రైనింగ్ వర్క్ షాప్ ప్రారంభిస్తున్న మంత్రి పసల పెంచలయ్య, ప్రక్కన కలెక్టర్ సాంబశివ రావు, జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర

కె. పద్మశ్రీ, డి.సి.బి. ఛైర్మన్ శ్రీవేమారెడ్డి రామచంద్రారెడ్డి , శ్రీనేదురుమల్లి పద్మనాభరెడ్డి మంత్రి పర్యటనలో భాగం పంచుకున్నారు. పలుచోట్ల మాజీ ముఖ్యమంత్రి శ్రీనేదురుమల్లి జనార్దనరెడ్డి చలువ వల్లే దళితుడైన శ్రీ పెంచలయ్య మంత్రి అయ్యారని పలువురు వక్తలు ప్రస్తుతించారు. ఈ పర్యటనలో పెంచలయ్య గారు పలు వాగ్దానాలు

కొరవ 8 పేజిలో

# నెల్లూరు రచ్చబల్లి

### విమర్శకుడు

## మనకొద్దండీ కడప సంస్కృతి!

మర్రిపాడు మండల మాజీ అధ్యక్షుడు శ్రీ ఎం.వి. నారాయణ రెడ్డి, పార్లమెంటు మాజీ సభ్యుడు శ్రీ ఎం. రాజమోహన్ రెడ్డి వర్గాలు బాగ బాంబులు, తుపాకులతో మున్న తలపడ్డారట. ఈ దాడి నారాయణ రెడ్డి ఇంటి మీద పురికొంచిందన్నారు. రాజమోహన్ రెడ్డి గారి తమ్ముడు నాయకత్వం వహించాడట. వాస్తు లేదా లేదు. రాజకీయమైన సెగలు పొగలు మాత్రం తీవ్రంగా వున్నట్లున్నాయి. కారణాలు, కారకులు, తప్పొప్పులు వగైరా వివరాలలోకి మేము వెళ్లదలం లేదు. కాని, సంస్కార వంతమైన నెల్లూరు జిల్లాకు బాంబులు, నాటు తుపాకులు, హత్యల కడప సంస్కృతి దిగుమతి చేసి అప్రతిష్ఠ తేవద్దని మా విజ్ఞప్తి.

రాజమోహన్ రెడ్డి - నారాయణ రెడ్డి అతి సన్నిహితులు; ఉదయగిరి రాజకీయాలలో ఒకొకట్లు ఒకటిగా ఒకర్నొకరు వదలకుండా మెలిగిన వారు. ఆ సాన్నిహిత్యం ఇప్పుడు శత్రుత్వంగా మారింది. మాదాల జానకిరాం - నారాయణ రెడ్డి మొదట మిత్రులు; మధ్యలో విరోధులు; ఇప్పుడు మళ్లీ స్నేహితులు. రాజకీయాలలో విహితాలు విరోధాలు శాశ్వతం కావు. అది అందరికీ తెలిసిన నగ్నసత్యం. అంత మాత్రానికే, ప్రస్తుతం సరిపడనంత మాత్రాన ఆయుధ పోరాటానికి దిగడం అనాలోచితం, అనాగరికం. రాజమోహన్ రెడ్డి, నారాయణ రెడ్డి విద్యావంతులు. పది మందిలో మెలిగే వారు. ఒకరికి మంచి మాట చెప్పాల్సిన విజ్ఞులు. అటువంటి వారు ఇంత మొరటుగా వ్యవహరించడం శోచనీయం.

దురభిప్రాయ పడకుంటే రాజమోహన్ రెడ్డికి ఒక మాట; రాజకీయాలలో ఏర్పడే విభేదాలు కక్షలు కార్పణ్యాలు మనిషిలో శాశ్వతంగా తిష్టవేయడం అభివృద్ధికి తీవ్ర ప్రతిబంధక మవుతుంది. పైకి రావలసిన రాజమోహన రెడ్డి వాటిని విసర్జించి తన వ్యతిరేకుల మనసు మారుటకు దోహదమివ్వడం సముచితంగా వుండదా?

## పోయినవి

### ఫుడ్ ఇన్స్పెక్టర్ ట్రైనింగ్ సర్టిఫికేట్

ఈ నెల 3 తేది నేను అల్లూరు నుండి కోవూరుకు బస్సులో పోవుచుండగా నా ఫుడ్ ఇన్స్పెక్టర్ ట్రైనింగ్ సర్టిఫికేటు, ఇతర కాగితములు పోయినవి. కవరుపై వి. పుల్లయ్య, శానిటరీ ఇన్స్పెక్టర్ - కమ్- ఫుడ్ ఇన్స్పెక్టరు, వెంకటగిరి, నెల్లూరు జిల్లా అని ఇంగ్లీషులో వ్రాసి ఉంది. ఎవరికైనా ఆ కవరు దొరకితే నాకు తెలుపండి. తగిన బహుమతి ఇవ్వగలను.

వి. పుల్లయ్య,
శానిటరి ఇన్స్పెక్టర్
అల్లూరు గ్రామ పంచాయితీ,
నెల్లూరు జిల్లా.

## కోఆపరేటివ్ బ్యాంకు వసూళ్లు బాగున్నాయి.

అధ్యక్షుడు శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి మార్చిలోగా కోఆపరేటివ్ బ్యాంకును రాష్ట్రంలో మిగతా బ్యాంకులతో సమమైన స్థాయికి తేవాలనే పట్టుదలతో, జిల్లా అంతటాలికి బలవం కట్టుకొని తిరుగుతున్నారు. వసూళ్లు 40 శాతం వరకు చేరుకున్నాయి. మరి 1[illegible] శాతం వసూలైతే బ్యాంకుకు నా బార్డ్ రీ ఫైనాన్స్ వస్తుంది. ఆ లక్ష్యంతో బ్రాంచి సమావేశాలు పెట్టి అధికారులను ఉద్యోగులను తరుముతున్నారు. ఆగర్ధణ కోసం, కొత్తగా ఇచ్చే అప్పులను ఏ పూరికా పూరిలో ఆసెది స్పాట్ శాంక్షన్ పద్ధతిలో ఇస్తూంతడం పల్లెరైతులూ ఉత్సాహంగా కదుతున్నారట.

రామచంద్రారెడ్డి గారి పుణ్యాన అయినా బ్యాంకు బాగుపడితే, రైతులు సంతోషిస్తారు.

## పెద్దాస్పత్రి పాడు పడిపోయింది!

నెల్లూరు పెద్దాస్పత్రి పరిస్థితి రోజా రోజుకీ దారుణంగా తయారౌతున్నది. ఆఖరుకు ఆపరేషన్ థియేటర్‌ను సైతం పాడుపెట్టారు. 15 రోజుల నుంచి ఆపరేషన్లు లేవు. విద్యుత్ కనెక్షన్లలో లోపాలు, చిన్న చిన్న పరికరాల కొరత దీనికి కారణమట.

ఆస్పత్రి నిధులే కాదు, రోగుల రక్తాన్ని కూడా పీల్చి పారేస్తున్నారిక్కడ. ఇందరు నాయకులుండీ దాన్ని చక్కదిద్దలేక పోవడం నెల్లూరు చేసుకున్న దౌర్భాగ్యమనుకోవాలి. ఉన్నతాధి కారులతో పాటు, నాయకులను కూడా బోకున కొని, ఆస్పత్రిని దోచుకుంటున్నారు. ఈ ప్రారబ్ధం ఎప్పుడు తొలగుతుందో మరి!

## సారాయి ఉద్యమం

ఉద్యమం పాటికి ఉద్యమం, సారాయి అమ్మకాల పాటికి అమ్మకాలు సజావుగా జరిగిపోతున్నాయి. దొంగ సారాయి వ్యాపారస్తులకు నెల్లూరు స్వర్గతుల్యంగా వుంది. టౌన్‌లోను, గ్రామాలలోనూ కూడా యథేచ్ఛగా, బహిరంగంగా సారాయి అమ్మకాలు సాగుతున్నాయి. రౌడీజం కూడా మొదలైంది. అడ్డం వచ్చే ఉద్యమ కార్యకర్తల పై దాడులు జరుగుతున్నాయి అధికారులు ఏమీ చేయలేక పోతున్నారు జిల్లాలో అరాచకానికి వచ్చినట్లుండీ ఉద్యమం. ప్రొహిబిషన్ అంటూ పెడితే దొంగ సారా వ్యాపారస్తుల పంట ఇంకా పండుతుంది!

## ఆర్టీసి కాల్పులపై న్యాయవిచారణ

ఆర్‌టిసి బస్టాండులో సిబ్బందికి, పోలీసుకు మధ్య జరిగిన ఘర్షణ, కాల్పులపై విచారణకు నియమితమైన ఏక సభ్య న్యాయ కమిషన్ తన దర్యాప్తును ఈ రోజు (6 తేది) నెల్లూరులో ప్రారంభించింది. పోలీసులు దండిగా సాక్షులను హాజరు పరుస్తున్నారు.

## రాజారెడ్డికి ఇక్కడేం పని?

జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రిత్వం నుండి వైదొలగిన తర్వాత వెంకటగిరిలో రాజశేఖర రెడ్డి వర్గమొకటి ఏర్పడినట్లు వార్త వచ్చింది. వర్గం అనే మాట వాస్తవం కాదు. జనార్ధన రెడ్డి వర్గీయులైన స్థానిక నాయకులంటే సరిపడని వ్యక్తులు కొందరుండవచ్చు. పత్రికలలో చూచే వరకు దూరంగా వున్నమనకు అక్కడ రాజశేఖర రెడ్డి వర్గం అంటూ ఒకటున్నదనే విషయం తెలియదు.

ఈ నేపథ్యంలో ఒక సంఘటన. ఆ వర్గంలోని ఒక యువకుణ్ణి జనార్ధన రెడ్డి వర్గానికి చెందిన వారెవరో కొట్టారట. పోలీసరిపోర్టు అవీ జరిగిపోయాయి. ఈ చిన్న సంఘటనను పురస్కరించుకొని డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి గారి తండ్రి రాజా రెడ్డి గారు సాయుధ భటుల కావలాతో జీపు మధ్య కూర్చొని వెంకటగిరికి వేంచేసి, బాధితుణ్ణి పరామర్శించి, నీ ప్రాణానికి నా ప్రాణం అని అభయమిచ్చి, ఖబడ్దార్ అని స్థానిక జనార్ధన రెడ్డి వర్గీయులను హెచ్చరించి పోయారట.

రాజారెడ్డి హంతకుడనే పేరున్న వాడుగా, బరైటీస్ గనుల భోక్తగా, రాత్రి పగలు సాయుధ భటుల రక్షణ లేకుండా అడుగు బయట పెట్టలేని పెద్ద మనిషిగా, రాజశేఖర రెడ్డి గారి తండ్రిగా తప్ప మరో విధంగా తెలిసిన వాడు కాదు. ఆయన మొహమే నెల్లూరీయులకు తెలియదు. అటువంటి రాజారెడ్డి ఏ హోదాలో, ఏ అధికారంతో వెంకటగిరికి వచ్చాడు? రాజశేఖర రెడ్డి వర్గమంటూ ఒకటుంది. వారికేదైనా అన్యాయం జరిగితే, ఆ సాకుతో జనార్ధన రెడ్డి నియోజక వర్గంలో ప్రవేశం కల్పించుకోవడానికి డాక్టరు వచ్చి వుండవచ్చు. అంతే గాని ఈయనెవరు?

వెంకటగిరీయుల్లారా, మీరు శాంతి సమనస్కాలతో వున్నారు. రాజారెడ్డి బోటి వారికి ప్రవేశం కల్పించి, నిత్యం హత్యలు దొమ్మీలతో అశాంతిని కొనితెచ్చుకోకండి!

## మరణం

నెల్లూరు ఫతేఖాన్ పేట వాసి, స్వాతంత్ర్య వీరుడు శ్రీ అరిగెల వీర రాఘవయ్య భార్య శ్రీమతి రాజమ్మ (68) 24 తేది దివంగతురాలైంది. ఆమెకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు.

వృద్ధాప్యంలో భార్యా వియోగం కంటె నరకం మరొకటి లేదు. వీర రాఘవయ్యకు మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 17.1 అ |
| సర్వేపల్లి | 4.15 అ |

## ముఖ్య సవరణ

ఈ పత్రిక మొదటి పేజీలో ఆమోదించిన [illegible] ప్రారంభోత్సవ సందర్భంలో శ్రీ పెనుబల్లి సీతారామిరెడ్డి శ్రీలక్ష్మమ్మ వేలుగోపాల రెడ్డి మేనల్లుడని తప్పుగా పడింది. సీతారామి రెడ్డిగారు స్వర్గీయ లక్ష్మమ్మ వెంకటనారాయణరెడ్డి గారి పెదిమంటి మేనల్లుడు. ఈ తప్పుకు చింతిస్తూ, పాఠకులు గమనించగలరని ఆశిస్తున్నాము.

## ఎప్పటి ఎన్నికలకో

(మొదటి పేజీ తరువ)

పర్యటన చేసే అవకాశం లభించింది. అప్పటి వలె ఇప్పుడూ 'తనాడు' నిప్పుకు గాలి తోడు వేస్తున్నది.

ఈ పరిణామాలన్నీ రాజకీయ వాతావరణాన్ని ఉద్రిక్తభరితం చేస్తున్నాయి.

విజయభాస్కరరెడ్డి శాసన సభకు ఎన్నికయ్యే విషయంలో చిన్న మెలిక పడింది. చట్టం ప్రకారం ఆయన మార్చి 10 తేదిలోపల ఎమ్మెల్యేగా ఎన్నిక కావాలి. కాని ఇప్పుడు ఓటర్ల జాబితా సవరణ జరుగుతూంది. దానికి మార్చి 9 తేది తుది గడువు. ఎన్నికల నిబంధనల ప్రకారం సవరణ తేదికి 43 రోజుల లోపల ఎన్నికలు నిర్వహించకూడదు. అప్పటివరకు ఆగితే విజయభాస్కరరెడ్డి పదవి పోతుంది. ఇప్పటికిప్పుడు పెట్టాలంటే పాత జాబితా ప్రకారం పెట్టాలి. అది ఎన్నికల నియమావళి చట్టానికి విరుద్ధం. ఏదైనా ప్రత్యేక సవరణ లేదా మినహాయింపు చేస్తే తప్ప ఈ ఉప ఎన్నిక జరగదు.



# సంస్మృతి



స్వర్గీయ ఏనుగ వెంకట నర్సారెడ్డి గారి భార్య

## ఏనుగ రామమ్మ గారి

## 50 వ వర్థంతి

దామరమడుగులో 10.11.1992 తేది కార్తీక పౌర్ణమి రోజు జరుగును.
అభిమానులెల్లరు పాల్గొన ప్రార్థన.

**బీదలకు** అన్నదానము వస్త్రదానము **జరుగును**



**కుమారులు**
ఏనుగ శ్రీనివాసులు రెడ్డి
ఏనుగ సీతారామరెడ్డి
ఏనుగ జనార్దనకృష్ణారెడ్డి
ఏనుగ అనంత పద్మనాభ రెడ్డి

**సోదరులు**
సోమారెడ్డి సుబ్బారెడ్డి
సోమారెడ్డి రమణారెడ్డి
సోమారెడ్డి పెదవెంకు రెడ్డి

**కుమార్తె**
తిక్కవరపు శీతారత్నమ్మ

**చెల్లెలు**
ఇందుకూరు లీలావతమ్మ

* మద్రాసు ఇండస్ట్రియల్ కెమికల్ ఏజన్సీస్
* కామాక్షి కలర్ కంపెనీ
* శ్రీ శ్రీనివాస కలర్స్

రాపూరు కాలేజి దురవస్థ

# భవనమైతే కట్టారు కాని, వసతులు కల్పించలేదు!

రాపూరులో ఇటీవల కొత్తగా ప్రారంభించిన డిగ్రీ కళాశాలలో కనీస సౌకర్యాలు కరువయ్యాయి. పట్టణానికి మూడు కిలోమీటర్ల దూరంలోని మద్దెల మడుగు వద్ద కళాశాల భవనాన్ని నిర్మించడంతోనే విద్యార్థులకు కష్టాలు ప్రారంభమైనాయని చెప్పవచ్చు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్ధనరెడ్డి చేతుల మీదుగా ప్రారంభమైన ఈ కళాశాలలో విద్యార్థులు త్రాగేందుకు మంచినీళ్ళు కరువయ్యాయి. దీనితో మధ్యాహ్నభోజనం చేసేందుకు వీరు తంటాలు పడుతున్నారు. ఇక్కడ ఏర్పాటు చేసివున్న బోరింగ్ పంపుకు మోటారు త్రిఫేస్ విద్యుత్ వేస్తేగాని పనిచేయదు. మూత్రశాలలు, మరుగుదొడ్లు లేకపోవడం వల్ల విద్యార్థినుల అవస్థ అంతింతకాదు. అరకొర సౌకర్యాలతో భవనాన్ని ఎలా పూర్తిచేసారయ్యా అని విద్యార్థులు కంట్రాక్టర్లనడిగితే చేసిన పనికి బిల్లు లివ్వలేదని సమాధానం ఇస్తున్నారట. ఎమ్మెల్యే వెంకటరత్నం నాయుడు కాలేజి నిర్మించడంలో చూపిన శ్రద్ధ, సౌకర్యాలు మెరుగు పర్చడానికి కూడా చూపాలి.

## తుఫాన్ డ్యూటీకి టీచర్లు హాజరు కారట

తుఫాన్ డ్యూటీకి తమను నియమించ వద్దని అల్లూరు మండలానికి సంబంధించిన కొందరు ఉపాధ్యాయులు ఎమ్మార్వోకు సమర్పించిన వినతి పత్రాల్ని గూర్చి ప్రజలు పలు రకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. నవంబర్ నెల జిల్లాలో తుఫాన్‌లు సంభవించే అవకాశం వున్నందున ఆ సమయంలో సహాయక చర్యలు చేపట్టేందుకు వివిధ శాఖల అధికారులను సహజంగా ఉపయోగించుకోవడం జరుగుతుంది. గత సంవత్సరం అల్లూరు మండలంలో పంచిన తుఫాన్ నిధుల్లో లక్షలాది రుపాయలు దుర్వినియోగం కావడం, విచారణలో పలువురు ఉపాధ్యాయులు దోషులని తేలడం, ఆ నివేదికకు రాజకీయ నాయకుల ప్రమేయంతో గ్రహణం పట్టిన నేపథ్యంలో ఉపాధ్యాయులు ప్రస్తుతం ఈ విధమైన విజ్ఞప్తి సమర్పించడం చర్చనీయాంశంగా మారింది. 1991 నవంబర్‌లో సంభవించిన తుఫాన్‌లో మండలం లో కొంత ప్రాంతం దెబ్బతిన్నది. ఎన్యూమరేషన్ అధికారులుగా వ్యవహరించిన ఉపాధ్యాయులు మాత్రం భారీ నష్టం సంభవించినట్లు నివేదికలు రూపొందించారు. మొదటి విడతగా 30 లక్షలకు పైగా నష్టపరిహారం చెల్లించారు. తుఫాన్ నిధులు దుర్వినియోగ మవుతున్న తీరుపై పత్రికల్లో వార్తలు రాగా అప్పటి కలెక్టర్ శ్రీ కె.రాజా నిధుల పంపకం ఆపేశారు. దీనివల్ల 33 లక్షలకు పైగా ప్రభుత్వ ధనం ఆదా అయ్యింది. ఈ నిధులు దుర్వినియోగమైన తీరుపై కలెక్టర్ నియమించిన ప్రత్యేక బృందం లక్షలాది రూపాయలు దుర్వినియోగమైనట్లు నివేదిక సమర్పించింది. ఉపాధ్యాయులు తమ న్యాయం గడుపుకోను రాజకీయ నాయకులను ఆశ్రయించడం ఆ నివేదిక తొక్కి పెట్టడం జరిగింది. పలు అక్రమ పద్ధతుల్లో తమవిగా చేసుకొన్న నిధులను ఉపాధ్యాయులు , పలుశాఖాధికారులు పలు రకాలుగా ఉపయోగించుకున్నారు. కొందరు కలర్ టివి లకు ఏంటున్నాలు లేకుండా కలర్ టివి లకు డిష్ కనక్షన్‌లు తీసుకొంటే మరికొందరు పొలం పుట్రా కొన్నారు. ముందుగానే అల్టిమేటం ఇవ్వడం వల్ల తాము ఎంత అవినీతికి పాల్పడ్డా .. విచారణ అనగానే పోరాటానికి వాళ్ళ సంఘాలను ఎగ ద్రోయ వచ్చున్నది వీరి పన్నాగం కావచ్చు, అయ్యవార్లు ఎంత తెలివి మీరిపోతున్నారండీ.

## లేబూరు వివరణ

లేబూరులో లైట్లు వెలిగాయని గతవారం జమీన్‌రైతు వేసిన వార్తలో

## జిల్లావార్తలు

పెర్మినెంట్లుగా రాష్ట్ర విద్యుత్ బోర్డు ఛైర్మన్ బలరామిరెడ్డికి విందు ఏర్పాటు చేసి ఆదవవు ట్రాన్స్‌ఫార్మర్ కానుకగా పొందలేదని గ్రామస్థుల తరుపున దొడ్ల సురేంద్రరెడ్డి తెలియ జేస్తున్నారు. గ్రామంలో ఒక కార్యక్రమంలో పాల్గొనడానికి వచ్చిన ఆయనకూ వాస్తవ పరిస్థితి చూపించి, చెప్పేసరికి ట్రాన్స్‌ఫార్మర్ సహాయం చేసినట్లు చెబుతున్నారు. సరదాగా చేసిన వ్యాఖ్యను గ్రామస్థులు సీరియస్‌గా తీసుకున్నట్లుంది; మరీ అంత సున్నిత మనస్కులైతే ఎట్లా?

## లాభాల్లో విక్రమసింహ ఆర్టీసీ రీజియన్

నెల్లూరు, ప్రకాశం జిల్లాలకు అనువర్తించే విక్రమ సింహ ఆర్టీసి రీజియన్ రాష్ట్రంలోనే అత్యధిక లాభాలతో నడుస్తున్నదని ఛైర్మన్ శ్రీ చెలికం శంకరరెడ్డి చెప్పారు. 22తేది రాపూరు ఆర్టీసీ బస్ డిపోను సందర్శించను వచ్చి విలేకరులతో మాట్లాడారు. సెప్టెంబరు నెలలో ముగిసిన గత ఆర్థిక సంవత్సరంలో రీజియన్‌కు కోటి 80లక్షల లాభాలు వచ్చాయట. వీటిలో కోటి 50లక్షలు నెల్లూరు డివిజన్ నుండి రాగా 30లక్షలు ఒంగోలు డివిజన్ నుండి వచ్చాయి. ప్రస్తుతం అన్ సీజన్ కావడంవల్ల రాపూరు డిపో నుండి కొత్త రూట్‌లలో సర్వీసులు నడుపుటకు వీలు కాదని చెప్పారాయన. ఇక్కడి బస్టాండ్‌లో రద్దీ పెరగడం వల్ల ప్లాట్ ఫారంపెంచే ఆలోచన వుందని చెప్పారు. దీనికితోడు గ్యారేజిలో జనరేటరును కూడా ఏర్పాటు చేస్తామన్నారు. ఈ డిపోకు 91-92 సంవత్సరానికి దాదాపు 19 లక్షల రూపాయల ఆదాయం వచ్చిందట. రీజియన్ మొత్తం మీద లక్షా అయిదువేల మంది కార్మికులు పనిచేస్తున్నారని చెప్పారాయన.. ఆర్టీసి డి.వి.ఎం. స్థానిక డిపో మేనేజర్ జి. నాగేంద్ర ప్రసాద్ శ్రీ శంకర రెడ్డిని అనుసరించారు.

## జిల్లాలో కిరోసిన్ రేట్లు

జిల్లాలోని వివిధ మండలాల్లో రేషన్ షాపుల ద్వారా ఇచ్చే కిరోసిన్ రేట్లను నిర్ధారించినట్లు జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర చెప్పారు. ప్రభుత్వం నిర్ణయించిన ఈ రేట్ల కన్నా ఎవరైన డీలర్లు అధికంగా అమ్మితే వారిపై ప్రజలు ఫిర్యాదుచేయ వచ్చంటున్నారు. వివిధ మండలాలకు నిర్దేశించిన లీటరు రేటు- నెల్లూరు, కోట, కోవూరు, కొడవలూరు 2-90 పైసలు; అల్లూరు , దగదర్తి, ఇందుకూరు పేట 2-91; చేజర్ల, కలువాయి, 2-92; బోగోలు 2-93; టి.పి.గూడూరు, ముత్తుకూరు, విడవలూరు, బుచ్చి, సంగం 2-94 ; పొదలకూరు, రాపూరు, సైదాపురం, మనుబోలు 2-95 పైసలు ; అనంతసాగరం , గూడూరు, చిల్లకూరు , వెంకటగిరి, వరికుంటపాడుల్లో 2-86 పైసలు కాగా ఓజిలి, దక్కిలి, బాలాయపల్లి2-87;, కావలి, జలదంకి, కొండాపురం మండలాలకు 2-80 గా నిర్ధారించారు.

## అక్రమ సారాపై ఆర్డీవో దాడి

నెల్లూరు డివిజన్ పరిధిలోని పలు గ్రామాల్లో దంగతనంగా అమ్ముతున్న అక్రమ సారాను ఆర్డీవో శ్రీ జి. సత్యప్రసాద్ స్వయంగా దాడిచేసి పట్టుకున్నారు. 14తేది పొదలకూరు మండలం తాటిపర్తి గ్రామంలో అక్రమ సారాను నిల్వచేసిన కె. తిరుపాలయ్య ఇంటిపై దాడిచేసి మూడు కాన్లలో దాచిపెట్టిన 20లీటర్ల అక్రమ సారాను స్వాధీనం చేసుకున్నారు. 15 తేది ఇందుకూరు పేట మండలం నరసాపురం, మైపాడు, గంగపట్నం, గ్రామాల్లో దాడి జరిపి 152 సారాపొట్లాలకు పైగా స్వాధీనం చేసుకున్నారు. ఆరోజే వెంకటాచలం మండలం పాలిచెర్లపాడు, కసుమూరు గ్రామాల్లో దాడిచేసి 5లీటర్ల సారాయి స్వాధీనం చేసుకున్నారు. అక్రమ సారాపై తమకు తెలిసిన సమాచారాన్ని ప్రజలు తమకు తెలియజేస్తే తక్షణం దానిపై చర్య తీసుకొంటామని ఆర్డీవో ఒక ప్రకటనలో తెలియజేశారు.

## రాష్ట్రస్థాయి సాంస్కృతిక పోటీలు

గూడూరు డాక్టర్ దాసరినారాయణ రావు కళానిలయం తృతీయ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని రాష్ట్రస్థాయి సాంస్కృతిక పోటీలు డిశంబర్ 4,5 తేదీలలో జరుగుతాయని నిర్వాహకులు తెలిపారు. బ్రేక్‌డాన్స్, ఏకపాత్రాభినయం, భరతనాట్యం, కూచిపూడి, జానపద నృత్యం, సినిమా, జానపద, లలిత సంగీత విభాగాలలో పోటీలు జరుగుతాయి. ఆసక్తిగల వారు దరఖాస్తులను ఈనెల25 తేదీ లోపల పి. మురళి ప్రసాద్, కార్యదర్శి, డా.దాసరి కళానిలయం, గూడూరు వారికి పంపుకోవచ్చు



నూతన జమీన్ రైతు భవనంలో కొత్త జమీన్ రైతు సంచికను పరిశీలిస్తున్న జనార్ధన రెం

## జనార్ధనరెడ్డి

5 పేజీ కొరవ

ఇందిరాభవన్‌లో ఇందిరమ్మ వర్ధంతి శ్రద్ధాంజలి సభ. సందర్భం వర్ధంతి అయినా యువ కాంగ్రెస్ నేతలు లైట్లు, గీట్లతో సంబరం సృష్టించారు. చాలా కాలం తర్వాత ఇందిరాభవన్ జనంతో కిటకిట లాడింది. హాలే కాదు - ఆవరణం కూడా పట్టలేదు. ఇక్కడా జనార్ధన రెడ్డి గారు తన రాజీనామాకు దారి తీసిన పరిస్థితులు సుదీర్ఘంగా వివరించారు.

"నేను ఎవరికీ భయపడి రాజీనామా చేయలేదు. లాల్ బహదూర్ శాస్త్రి, నీలం సంజీవ రెడ్డిల వలె పదవి త్యాగం చేశాను. నన్ను హైకోర్టు తప్పు పట్టలేదు. న్యాయ నిపుణులందరూ హైకోర్టు తీర్పులో తప్పు పట్టలేదు కాబట్టి, రాజీనామా చేయనవసరం లేదని నివారించినా - న్యాయ పరంగా కంటే, నైతిక పరంగా పరిగణించాల్సిన విషయమని చెప్పి ఈ నిర్ణయం తీసుకొన్నాను. ఢిల్లీకి నేనే వర్తమానం పంపాను - దిగిపోవడానికి అనుమతి ఇవ్వమని; నన్నెవ్వరూ దిగమని కోరలేదు; అధిష్టాన వర్గం అసలే చెప్పలేదు; పత్రికలు మాత్రం ఢిల్లీ పెద్దలు నన్ను దిగిపొమ్మన్నట్లు వ్రాశాయి - పదవి పోయినదానికంటే ఆ దుష్ప్రచారానికే ఎక్కువ బాధపడ్డాను నేను; ఆ రోజు 140 మంది ఎమ్మెల్యేలు నా ప్రక్కన నిలబడ్డారు. అంత బలం వున్నా పార్టీ ప్రతిష్ట కాపాడడానికి రాజీనామా పెట్టేశాను; ఒక ప్రతిపక్షం నాయకుడు నా దగ్గరకు వచ్చి, తిరుగుబాటు చేస్తే తాము సమర్థిస్తామని చెప్పారు - కానీ పదవి పట్టుకుని ఊగులాడే వ్యక్తిని కాను నేనని చెప్పి పంపించాను....".ఇట్లా సాగింది జనార్ధన రెడ్డి ప్రసంగం.

వక్తలందరూ ఇందిరా గాంధీకి శ్రద్ధాంజలి ఘటించారు.

ఈ పర్యటనలో కావలి యానాది రెడ్డి గారు, అల్లూరు విష్ణువర్ధన్‌రెడ్డి మినహా తక్కిన ఎమ్మెల్యేలందరూ పాల్గొన్నారు. నెల్లూరు కార్యక్రమాలలో జెడ్ రెడ్డి అటెండైనారు. ఒంగోలు ఎమ్పి శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి ఏ కార్యక్రమమూ వదలకపోవడమే కాదు - 31 తేది రాత్రి తన ఇంట్లో ఖరీదైన విందు చేశారు. వీరిని అధ్యక్షుడు శ్రీ అనం సంజీవ రెడ్డి, మంత్రి శ్రీ పెంచలయ్య, ఎమ్పి కుమారి కె. పద్మశ్రీ తదితరులంతా వెంటనే వుండినారు. పదవి పోయినా, జనాదరణలో మాత్రం తనకు ఏ లోటూ లేదని నిరూపించారు జనార్ధన రెడ్డి గారి పర్యటనలో!

## సణుగుడు

(4 పేజీ కొరవ)

స్టూడియోలకు స్థలాలు ఇవ్వడం వంటి చిల్లర విషయాలలో తప్ప నిజాయితీగా పాలన చేసేవాడు అయిన అన్నగారికి తెరా తెలుసు కోలేని అవజ్ఞలను ఆర్టీసి నుంచి తక్షణం తొలగించాలని తెలుగు దేశం మహానాడులో తీర్మానం చేయాలి!

## పెంచలయ్య

5 వ పేజి కొరవ

చేశారు. ఇప్పటికే మంత్రుల వాగ్దానాలు వినివిని వినుగు పుట్టింది; చేయదలచుకున్నదేదో చేసి, ఆ తర్వాత చేశామని ప్రకటించుకునే అలవాటుకి పెంచలయ్య నాంది పల్కడం బాగుంటుంది.

## పంచాంగము

తేది 10 మంగళవారము కార్తీక పూర్ణిమ విశాఖ కార్తె జరుగుచున్నది

### ముహూర్తములు

తేది 12 గురువారము ఉదయం 4.00 గంటలకు కన్యాలగ్నమున వివాహ గృహారంభ గృహప్రవేశములకు; సాయంత్రం 3.45 గంటలకు కుంభలగ్నమున వివాహ వ్యాపారారంభ సుముహూర్తములు కలవు.

### నవంబర్ నెల తిథులు

| | | |
|---|---|---|
| తే 7 శని ద్వాదశి | ప.గ. | 11.20 వ |
| తే 8 ఆది త్రయోదశి | ప.గ. | 12.40 వ |
| తే 9 సోమ చతుర్దశి | ప.గ. | 1.50 వ |
| తే 10 మంగళ పూర్ణిమ | ప.గ. | 2.25 వ |
| కార్తీక బహుళ | | |
| తే 11 బుధ పాడ్యమి | ప.గ. | 2.28 వ |
| తే 12 గురు విదియ | ప.గ. | 2.00 వ |
| తే 13 శుక్ర తదియ | ప.గ. | 1.10 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

ఎం.ఎ

సినిమా సినిమా సినిమా

## ఎన్టీఆర్ ఇంట్లో దోపిడీ

ఎన్.టి.ఆర్. నాల్గవ పుత్రుడు, రామకృష్ణా స్టూడియో అధిపతి మోహన్ కృష్ణ మద్రాసు మహాలింగపురం రామనాథన్ వీధిలో నివాసం వుంటున్నారు. అక్టోబర్ 27 రాత్రి ఆయన ఇంట్లోలేని సమయం చూసి ముగ్గురు యువకులు కాలింగ్ బెల్ మోగించారు. శ్రీమతి మోహన్ కృష్ణ తలుపు తెరవగానే తాము మోహన్ కృష్ణను చూడటానికి ఢిల్లీ నుంచి వచ్చినట్లు చెప్పారు. ఆమె లోపల కూర్చోమని సోఫాలు చూపింది. వెంటనే వాళ్ళు కత్తి చూపి ఆమెను బెదిరించి నగలు, నగదు అప్పజెప్పకపోతే ప్రాణం తీస్తామన్నారు. ఆమె భీతిల్లి 30 సవర్ల బంగారు నగలు, పదివేల రూపాయల నగదును వాళ్లకు అప్పగించింది. వెంటనే ఆ ముగ్గురూ పారిపోయారు. అసిస్టెంట్ కమీషనర్ శెట్టి, ఇన్స్పెక్టర్ వీరమణి కేసు నమోదు చేసి, ఆ దుండగుల కోసం గాలిస్తున్నారు.

### "ఇదండీ మావారి వరుస"

పై టైటిల్ తెలంగి నరసింహారావు వరుస ;ఈయన

13వ 11 పేజిలో

## గోపాలరెడ్డి కుమారుడికి ప్రమాదం

బాలకృష్ణతో కోదిరామకృష్ణ దర్శకత్వంలో త్వరలో ప్రారంభమయ్యే చిత్రానికి ప్రీ ప్రొడక్షన్ వర్క్ జరుగుతోంది. నిర్మాత ఎస్. గోపాలరెడ్డి పుత్రుడు భార్గవ్ బెంగుళూరు చదరంగపు పోటీలకు మోటార్ బైక్‌లో తన మిత్రుడితో కలిసి వెళ్తొండగా స్పీడ్ బ్రేకర్ తగిలి ఆ వాహనం తలక్రిందులైంది. స్పృహ తప్పిన భార్గవ్ వెంటనే ఆస్పత్రిలో చేర్పించబడ్డారు. క్రమక్రమంగా కోలుకుంటున్నారు.

ఎస్. గోపాలరెడ్డి తోడల్లుడి కుమార్తె సా. శిరీషతో వర్ధమాన నటుడు చిన్నా వివాహం ఇటీవల తిరుపతిలో వైభోపేతంగా జరిగింది.

### శ్రీ జయభేరి చిత్రంలో నాగార్జునతో పాటు కృష్ణ

ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో మురళీమోహన్ సమర్పించే శ్రీ జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రంలో కృష్ణ, నాగార్జున తొలిసారిగా కలసి నటిస్తున్నారు. నగ్మా నాయిక. తనికెళ్ల భరణి, బ్రహ్మానందం, బాబూమోహన్, కోవై సరళ ఇతర పాత్రధారులు.

## గుమ్మడి ఆర్టుఫిలిం నిర్మాణం

వాసి పెరిగి, నాణ్యత ఉన్న చిత్రాలు కొరవడిన ఈ రోజుల్లో ప్రతిష్టాత్మకమైన చిత్రాలు నిర్మించడం సాహసమే అవుతుంది. అలాంటి సాహసానికి పూనుకుంది, గుమ్మడి వెంకటేశ్వరరావు మేనేజింగ్ డైరెక్టరుగా వ్యవహరించే "సంస్కృతి" సంస్థ. దీని కోసం మెదక్ జిల్లా రామచంద్రాపురం మండల మాజీ అధ్యక్షులు వి.భూపాల్ రెడ్డి లక్షరూపాయల ఆర్థిక సహాయాన్ని ప్రకటించారు. అమెరికా వగైరా విదేశాలలోని మరికొందరు మిత్రులు కూడా ఆర్థికంగా ఆదుకోవడానికి సిద్ధపడ్డారు. ఈ సంస్థకు డాక్టర్. సి.నారాయణ రెడ్డి, మాజీ మంత్రి కేశవరావు, నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు, నటుడు డాక్టర్ ప్రభాకరరెడ్డి సలహాదారులు గనుక మేలు రకపు చలన చిత్రాలు రూపొందుతాయని విశ్వసించవచ్చు. వచ్చే జనవరి నుంచి నిర్మాణ కార్యక్రమాలు మొదలవుతాయి. ఆరోగ్యకర ధోరణి చిత్రాలకు ఆదర్శ వంతులైన "సంస్కృతి" సంస్థవారు మారు పేరుగా అభివృద్ధిచెందాలని ఆకాంక్షిస్తున్నాము.

## పోలీసు కథలు ఇంకెంతకాలం?

సంఘంలోని కుళ్ళును సహేతుకంగా కడగవలసిన చిత్రాల ఆవశ్యకత ఎంతైనా ఉంది నిజమే. అందుకు పోలీసు వ్యవస్థ నేపథ్యంలోనే చిత్ర కథలు రూపొందాలా? నిజాయితీ పరులైన పోలీసు అధికారులపై ఇప్పటికి ఎన్నో చిత్రాలు వచ్చాయి. ప్రేక్షకులకు విసుగెత్తి పోయింది. ఇక భరించేలా లేరు. నిజాయితీ పరులుగా ఇంజనీర్లు, డాక్టర్లు, టీచర్లు, లాయర్లు తదితరులను చూపిస్తూ కాస్త కథల రూటు మార్చవచ్చు కదా?

### "శ్రీనాథ కవి సార్వభౌమ"

ఎన్.టి.ఆర్. ప్రధాన పాత్రధారిగా బాపు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నందమూరి రామకృష్ణ నిర్మించే పై చిత్రం 80 శాతం పైగా పూర్తయింది. రాజేంద్ర ప్రసాద్, జయసుధ, ఆమని, దివ్యవాణి, గుమ్మడి, మిక్కిలినేని, రాళ్లపల్లి, సుధాకర్, మొదలగు వారు పాల్గొంటున్నారు. మాటలు:ముళ్ళపూడి వెంకటరమణ, గీతాలు: సి. నారాయణ రెడ్డి, సంగీతం: కె.వి. మహదేవన్, : ఛాయ : నందమూరి మోహన్ కృష్ణ

## ప్రధాని కుమారుడి గానం

శరత్ బాబు, చంద్రమోహన్, కాంతారావు, వేలు, జయలలిత, వందన, సుశీలాదేవి నవనాయిక వీణ నరసన ఒక వర్ధమాన నటుడు పాల్గొనే దివాకర్ ఆర్ట్స్ పిక్చర్స్ "రౌడీ లీడర్" చిత్రంలో మన ప్రధాని పి.వి. నరసింహారావు గారి పుత్రుడు పి.వి. రాజేశ్వరరావు ఒక నేపథ్యగానాన్ని ఆలపించారు. శ్రుతిలయలకు అతీతంగా ముద్దుగా ఉండే కంఠ స్వరంతో ఆయన పాడిన పాటకు అప్పుడు అక్కడ వున్న సినిమా వారపత్రికా విలేకరులు లోపల ఎంత వికారం కల్గినా పైకి ఎంతో ఆనంది స్తున్నట్లు నటించారు. తప్పదుగా మరి!

### ఎన్టీఆర్‌తో మోహన్ బాబు చిత్రం

నవంబర్ 20 న షూటింగ్ ప్రారంభమయ్యే లక్ష్మీ ప్రసన్న పిక్చర్స్ చిత్రంలో ఎన్టీఆర్ రిటైర్డ్ మిలటరీ ఆఫీసర్‌గా నటిస్తున్నారు. శారద, మోహన్‌బాబు, నగ్మా, పరుచూరి వెంకటేశ్వర రావు, అమ్రేష్‌పురి, బాబూమోహన్, బ్రహ్మానందం, అన్నపూర్ణ వగైరాలు నటవర్గం.



గౌరమ్మ చిత్రంలో యమున

## అభిమాన సంఘాల వారూ - మేల్కొనండి!

ఇటీవల తమిళనాడులోని దిండిగల్ అనే ఊళ్ళో బందిపోట్లు స్వైర విహారం చేశారు. ముసుగులు ధరించిన ఆ యువకుల్లో కొందరు తెలుగులోనే మాట్లాడుకున్నారట. ఆ మర్నాడే ఆ ఊళ్ళోని హీరో సత్యరాజ్ అభిమాన సంఘాలవారు పది మంది చొప్పున జట్లుగా ఏర్పడి, రాత్రిళ్ళు ఆ ఊళ్ళో కాపలా కాస్తున్నారట. అభిమాన తారలున్న చిత్రం విడుదలైన రోజున రంగు రంగుల తోరణాలు కట్టి, బాణా సంచా కాల్చి, కొబ్బరి కాయలు కొట్టి వేడుకలు జరుపుకునే మన రాష్ట్రంలోని అభిమాన సంఘాల వారందరూ కూడా ఇలాగే ప్రజలకుపయోగపడే పనులు చేస్తే తమ - సంఘాలకు, తమ ఊరికి, తమ అభిమాన తారలకు ఎంతో కీర్తి ప్రతిష్టలు తెచ్చిన వారవుతారు.



## కథ అతుకుల బొంత అయినా డ్యాన్సులు, పాటలు, ఫైట్లతో అదరగొట్టేశారు!

# ప్రెసిడెంటు గారి పెళ్ళాం

పది ఇంగ్లీషు చిత్రాల క్యాసెట్లు చూసి యాక్షన్ చిత్రానికి ప్రాణం పోసే కథకులతోనే ప్రేక్షకుల ప్రాణం పోతుంటే, ఇప్పుడు పది పాత తెలుగు గ్రామీణ నేపథ్యంలో తీసిన చిత్రాల తాలుకు సన్నివేశాలను అదే మూసలో చూపిస్తూ... టైటిల్స్‌లో మాత్రం తాము కథ రాసామని వేసుకొనే రచయితలు తెలుగులో మరీ ఎక్కువై పోతున్నారు. అందువల్లే ఒకప్పుడు దేశ చలన చిత్ర పరిశ్రమలో 'భేష్' అనిపించు కొన్న తెలుగు సినీ పరిశ్రమ నేడు దుస్థితిలో అల్లాడ వలసి వస్తోంది. తెలుగు కథకుల భావదారిద్ర్యంవల్ల పరభాషా కథకులు, దర్శకులు, చివరికి నటీ మణులపై కూడా ఆధార పడి, అదేకొత్తదనమని ప్రచారం చేస్తూ్త్రిరిళ్ళుచుట్టవలసి వస్తోంది. గత సంవత్సరం నుండి 'హిట్' కరువుతో అల్లాడి పోతున్న నాగార్జున - కోదండరామిరెడ్డి కాంబినేషన్ ద్వయం తెగ శ్రమ పడిపోయి తీసిన చిత్రం 'ప్రెసిడెంట్‌గారి పెళ్లాం'.

పలుకథల అతుకుల బొంతైన ఈచిత్రాన్ని సాఫీగా నడుపను దర్శకుడు పలు హంగులు, ఆర్భాటాలు చేశాడు. వెరైటీ అంటూ ఎడ్ల బండ్ల పోటీలు, ప్రతి 20 నిమిషాలకో పాట, పాటపాటకు మధ్య ఒక ఫైటు, మధ్య మధ్యలో మసాలా దినుసులుగా హీరోయిన్ డబుల్ మీనింగ్ మాటలు పుష్కలంగా వింపేశాడు. కాని గ్రామీణ వాతావరణం వుట్టి పడేలా గోదావరి ఒడ్డున పచ్చని పంట పొలాల మధ్య కొనసాగిన చిత్రీకరణ, వేటూరి కలం నుండి జాలువారిన రసరమ్య సాహిత్యానికి శ్రావ్యమైన సంగీత సహచర్యం చిత్రాన్ని ఒక సారి చూసేలా చేస్తున్నాయి.

ఇక కథలోకి వస్తే వరాహపురం గ్రామంలో దేవుడు (సత్యనారాయణ)కు తిరుగులేదు. 20 ఏళ్ల నుండి ప్రెసిడెంట్‌గా

చిత్రసమీక్ష
****
అల్లూరు రహీం

కొనసాగుతూ గ్రామాభివృద్ధిని ఏమాత్రం పట్టించుకోడు. ఆయన కూతురు స్వప్న(మీనా) తండ్రిలానే తల బిరుసు కల్గి వుంటుంది. ఆమె చదువుకొనే టౌన్‌లో ఒక రోజు జరిగిన ఎడ్లబండ్ల పోటీలో విజయం సాధించిన రాజా( నాగార్జున)తో పరిచయం అవుతుంది. టౌన్ నుండి సెలవలకు స్వగ్రామం వచ్చిన స్వప్న చేసిన అల్లరికి తగిన శాస్తి చేసిన రాజాపై పగ బట్టిన ఆమె, అతన్ని ప్రేమించినట్లు నాటక మాడుతుంది. ఇది తెలియని రాజా అమాయకంగా బోల్తాపడి దగ్గర చేరినరికి తనను అతను అఘాయిత్యం చేయ బోయాడని గ్రామ పంచాయితీ పెద్దల ముందు చెప్పి హీరోకు శిక్ష పడేలా చేస్తుంది. ఇంతలో పంచాయితీ ఎన్నికలు వచ్చేసరికి యువకులంతా రాజాను దేవుడుకు ప్రత్యర్థిగా నిలబెడతారు. రాజా ఓడిపోతే గ్రామాన్ని విడిచి పోవాలని, తాను ఓడిపోతే క్షమాపణ చెప్పి తనకూతురు స్వప్న నిచ్చి పెళ్లి చేస్తానని దేవుడు పందెం కాస్తాడు. ఎన్నికల్లో రాజానే గెలిచే సరికి మాట నిలబెట్టుకొను రాజాకే స్వప్న నిచ్చి పెళ్లిచేయను సిద్ధపడ్డా... పెళ్లి పీటలవరకు హీరోయిన్‌ను తీసుకెళ్లి, పెళ్లి విలువ తెలియచేసి తాళి కట్టకుండా వదిలేస్తాడు. దీనితో ఉగ్రుడైన దేవుడు తన వద్ద గుమాస్తాగా ఉండే రాజా అన్నయ్య చంద్రయ్య( చంద్రమోహన్)ను పావికగా ఉపయోగించి కుటుంబంలో కలతలు సృష్టిస్తాడు. స్వప్నకు మరో పెళ్ళి చేయను సిద్ధపడగా ఆత్మావలోకనం చేసుకొన్న ఆమె, రాజానుదరిచేరను పెక్కు తంటాలు పడి వెచ్చగొట్టి, క్రిందామీద పడి, అతన్ని ప్రసన్నం చేసుకొంటుంది. ఇంతలో దేవుడు నాదముని (కోటశ్రీనివాసరావు)ని చంపింది రాజాయేనని పోలీసుల చేత అరెస్ట్ చేయిస్తాడు. స్వప్న జిల్లా అధికారుల దృష్టికి తీసుకెళ్లి, గ్రామంలోనే 'ప్రజాకోర్టు' ఏర్పాటు చేయించి రాజాను నిర్దోషిగా నిరూపిస్తుంది.

13వ 11 పేజిలో

**In the Court of the Motor Accident Claims Tribunal Nellore**

(Addl. District Judge)
O.P. No. 346/85

K. Ravanamma and other - Petitioners
Vs
K. Kondappa Naidu and another - Respondents

To
SK. Jaffer Sahib
(Bus Owner: A.A.E. 3799)
S/o. Abba Saheb
Konetimitta, NELLORE

అనువారికి పై నంబరులోని పిటీషనర్లు నష్ట పరిహారము కొరకు పై కోర్టులో మీ మీద దావా చేసి యున్నారు. పై పిటీషనులో మిమ్ములను 3 వ రెస్పాండెంటుగా చేసియున్నారు. అందు నిమిత్తమై మీకు ఏ విధమైన ఆక్షేపణలున్నను 10.11.92 తేదిన ఉదయం 10.30 గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరయి స్వయముగా గాని, వకీలు ద్వారా గాని తెలుపుకోవలసినది. లేనిచో పరోక్షముగా తీర్మానించబడునని తెలియపరచడమైనది.

పి. బలరామయ్య
పిటీషనర్లు తరపున అడ్వకేటు

**Before the Principal Motor Accidents Claims Tribunal :: Nellore**

IA No. 72/92 :: OP No. /92

Between:
Samadi Prasad Rao - Petitioner
Vs
Jasti Manmada and Others - Respondents

To
Jasthi Manmada,
W/o. Haribabu
Owner of Lorry AP16T - 5469
Door No. 11/12/C, Gudiwada
Town, Krishna Dt.

2 వ రెస్పాండెంటుకు నోటీసు

పై నంబరు కేసులో పై పిటీషనరు నీ మీద నష్టపరిహారం దావా దాఖలు చేయుటలో అయిన 14 రోజుల ఆలస్యమును క్షమించవని కోరుచూ పై కోర్టులో పిటీషను దాఖలు చేసియున్నారు దాని మీద నోటీసు నిమిత్తం 12.11.92 తేదికి వాయిదా వేసి యున్నారు. కావున వాయిదా రోజు ఉదయం 10 గంటలకు పై కోర్టులో నీవు స్వయముగా కాని నీ తరపున వకీలు గారి ద్వారా కాని హాజరై నీ ఆక్షేపణలు తెలుపుకొనవలెను. లేని యెడల నీ పరోక్షమందు తీర్మానించబడునని ఇందు మూలమున నీకు తెలియజేయడమైనది.

కె.ఆర్. దుర్గాంబ
పిటీషనరు తరపు అడ్వకేటు

## సింహపురి

(4 పేజీ కొరవ)

వినియమని చెప్పారు. జాతిపిత మహాత్మాగాంధీ భావాలను నేటి యువత ఆచరించను ప్రయత్నిస్తే దేశంలోని ప్రతి సమస్యకు పరిష్కారం లభిస్తుందన్నారు. నెల్లూరు ఎమ్పీ కుమారి కె. పద్మశ్రీ. ఎమ్మెల్యే శ్రీ జె.కె.రెడ్డి అమర జీవికి నివాళులర్పించారు. అర్టిస్ట్ శ్రీవి. సత్యప్రసాద్‌రావు రచయిత శ్రీ జి. గోపాలరావు కూడా ఉపన్యసించారు. అనంతరం సంగీత అవార్డు గ్రహీత శ్రీ ఐ. కామేశ్వరరావు. చరిత్రకారులు శ్రీ ఎన్. కృష్ణమూర్తి . రంగస్థల నటి శ్రీమతి చంద్రబాలను శ్రీ గోపాల్ రెడ్డి దుశ్శాలువాలతో సత్కరించారు. డివిజన్ పౌర సంబంధ అధికారి శ్రీ ఎం.ఎం.ఖాన్ వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

### హిందీ శిక్షణా తరగతులు

దక్షిణ భారత హిందీ ప్రచారసభ నిర్వహించే ప్రాథమిక నుండి ప్రవీణ వరకు హిందీ బోధనా తరగతులు ప్రారంభమైనట్లు శ్రీ సరస్వతి హిందీ విద్యాలయం ప్రిన్సిపల్ తెలియ జేశారు. తరగతులు జరిగే సమయం, పరీక్షా వివరాలు అధ్యక్షంవారి వీధిలోని సరస్వతి హిందీ విద్యాలయంలోతెలుసుకోవచ్చు.

### ఆర్టీసిని పరిశీలించిన అండర్ టేకింగ్ కమిటీ

రాష్ట్ర శాసనసభా పబ్లిక్ అండర్ టేకింగ్ కమిటీ సభ్యులు అక్టోబర్ 30తేది ఆర్టీసి అధ్వర్యాన నడిచే కాకుటూరు రీజినల్ స్టాఫ్ ట్రైనింగ్ కళాశాలను, పడుగుపాడులోని టైర్ల రీట్రేడింగ్ ఫ్యాక్టరిని సందర్శించారు. జిల్లాలో అన్ కంట్రాక్టు బస్సులు రద్దుచేయడం వల్ల ఆర్టీసికి రోజుకు 60వేలు ఆదాయం లభిస్తున్నదని ఆర్టీసి రీజినల్ మేనేజర్ వి. అర్జున్ కమిటీకి తెలియ జేశారు. ప్రకాశం జిల్లాలో రవాణా శాఖాధికారులు సహకరించక పోవడం వల్ల అక్కడ అన్ కాంట్రాక్టులకు కళ్ళెంవేయ లేక పోయామని వివరిస్తూ ఆ జిల్లాలోని పలురోడ్లు దుస్థితిలో ఉండడంవల్ల ఆర్టీసి లాభాలు తగ్గాయన్నారు. కమిటీ ఛైర్మన్, నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె.రెడ్డి అధ్వర్యంలో వీరు జిల్లాలో పర్యటించారు. కోవూరులోని ఎన్.టి.ఎస్.తో పాటు దర్గామిట్టలోని సబ్‌స్టేషన్‌ను కూడా కమిటీ పరిశీలించింది.

### ఏకపాత్రాభినయ పోటీలు

'కన్యాశుల్కం ' నాటిక శత జయంత్యుత్సవాలను పురస్కరించుకొని రాష్ట్రస్థాయి 'గిరీశం' ఏకపాత్రాభినయ పోటీలను ఆంధ్రప్రదేశ్ ప్రజా నాట్యమండలి నవంబర్ 24న హైదరాబాదులో నిర్వహిస్తుంది. ఏక పాత్రాభినయం 15 నిమిషాలకు మించకూడదు.

విజేతలకు 1116, 750, 500 రూపాయలు ప్రథమ , ద్వితీయ, తృతీయ బహుమతులు ఇస్తారు. ఆసక్తి గలవారు ఈనెల 15 తేదిలోగా కె. ప్రతాపరెడ్డి, కార్యదర్శి, ఆంధ్ర ప్రదేశ్ ప్రజానాట్యమండలి, మగ్దుంభవన్, హైదరాబాద్- 29 కు ఎంట్రీలు పంపాలని నిర్వాహకులు కోరుతున్నారు.

### దుకాణాలు, వాహనాల రెన్యువల్‌కు గడువు

ఆంధ్రప్రదేశ్ దుకాణాల సంబంధ చట్టం యొక్క నియమావళి ప్రకారం దుకాణాలు, సంస్థలు 1993 సంవత్సరానికి రెన్యువల్ చేయుటకు డిశంబర్1 తేది తుది గడువని సహాయ కార్మిక కమీషనర్ శ్రీ లక్ష్మీనారాయణ తెలియ జేస్తున్నారు. లేకుంటే డిశంబర్ 31 తేదికి 25%, ఆ తరువాత ఏరోజైనా 50% జరిమానాతో రెన్యువల్ చేయించాలి

మోటారు వాహనాల లైసెన్సుల రెన్యువల్‌కు గడువు ముగిసినందువల్ల నవంబర్ 15లోగా 50% 30తేది లోగా 75% ఆ పై తేది అయితే 100% పెనాల్టీతో రెన్యువల్ ఫీజు కట్టమని కోరుతున్నారు.

### హిందీ కోర్సుకు దరఖాస్తు

నెల్లూరు ప్రభుత్వ బి.ఇడి., కళాశాలలో హిందీ పండితుల కోర్సులో చేరుటకు 15 తేది లోగా దరఖాస్తులు పంపుకోవచ్చు. దరఖాస్తుఫారం తోటి ఒక రూపాయికి స్టేట్‌బ్యాంక్ డ్రాఫ్టు జతచేసి పంపాలని, అగస్టు ప్రవేశ పరీక్షల్లో వుత్తీర్ణులైన వారందరికి ప్రిన్సిపల్ తెలియజేస్తున్నారు.

### జిల్లాలో 4కోట్ల పొదుపు

జిల్లాలో ప్రజలు చేసిన పొదుపు మొత్తాలు ఈ ఆర్థిక సంవత్సరంలో 4 కోట్లకు చేరుకున్నాయని పొదుపు మొత్తాల జిల్లా అధికారి వై. బుచ్చిరాజు చెప్పారు. 30తేది కలెక్టరేట్‌లో జరిగిన పొదుపు దినోత్సవంలో ఆయన ప్రసంగించారు. వచ్చే ఆర్థిక సంవత్సరంలో ఈ లక్ష్యాన్ని 15కోట్లుగా నిర్ణయించామన్నారు. దీని కోసం గ్రామీణప్రాంతాల్లో విస్తృతమైన ప్రచారం నిర్వహిస్తామన్నారు. ఈ కార్యక్రమంలో పొదుపు మొత్తాల ప్రత్యేక తహసీల్దార్ ఎం.ఎ. ఖయ్యూమ్, సంస్థకు చెందిన డేవిడ్, శేఖరబాబు తదితరులు ప్రసంగించారు.

### టౌన్‌లో ఇక 5.20పైసలకే బియ్యం

స్వేచ్ఛా విపణిలో బియ్యం ధర నానాటికి పెరిగి వినియోగదారునికి భారమైన దృష్ట్యా దాన్ని నివారించేందుకు పౌర సరఫరాలశాఖ జిల్లా రైసుమిల్లర్ల అసోసియేషన్‌తో 7తేది ప్రత్యేక సమావేశం నిర్వహించింది. దీని ఫలితంగా పింకు రంగు రేషన్‌కార్డు కల్గిన వినియోగ దారులకు సన్నాల రకం బియ్యం కిలో ఇకనుంచి 5.20 పైసలకే పంపిణీ చేస్తారు. ఈ రంగు కార్డు కలవారికి ప్రతినెలా 20కిలోల బియ్యం ఇస్తారు. వీటిని స్టోన్‌హౌస్ పేటలోని రైసుమిల్లర్ల కార్యాలయం వద్ద ఆదివారం మినహా మిగతా రోజుల్లో మధ్యాహ్నం 2గంటల నుండి సాయంత్రం 6గంటల వరకు విక్రయిస్తారు.

### కన్యాశుల్కం శతజయంతి ఉత్సవం

మహాకవి గురజాడ అప్పారావు అద్భుత సృష్టి'కన్యాశుల్కం' నాటక శతజయంతి ఉత్సవాన్ని నవంబర్ 30 తేది నెల్లూరు లో జరపాలని శ్రీ వేణుగోపాలస్వామి కళాశాలలోని తెలుగు విభాగం సంకల్పించింది. ఈ సందర్భంగా నవంబర్ 29 తేది కస్తూర్బా కళాక్షేత్రంలో ఎస్.వి. విశ్వవిద్యాలయ స్థాయిలో నాటక విశిష్టతపై వ్యాసరచన, ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహిస్తారట. 30వ తేది సాహితీ చర్చకూడా నిర్వహిస్తామని శ్రీ తిరుమూరు సుధాకరరెడ్డి చెబుతున్నారు.

## బ్రతుకనిస్తారా బాబూ, చావమంటారా

**రామావఝుల శేషయ్య**

బ్రతుకనిస్తారా, మమ్ముల చావమంటారా?
బ్రతుకలేక, చావలేక, బండబ్రతుకుల నీడ్చుతుంటే
నిండు నూరేళ్ల మా బతుకులు నీరు గార్చే నేతలారా
బ్రతుకనిస్తారా, మమ్ముల చావమంటారా

తెల్లదొరల పాలనములో చల్లో, గంజో త్రాగువారము
తెల్లవారిని సీమకంపి, నల్లదొరలకు రాజ్యమిస్తే
కుళ్లబొడిచే నేత లొచ్చి, కూడు గుడ్డకు లోటు తెస్తిరి
బ్రతుకనిస్తారా బాబూ చావమంటారా?

కల్లుసారా లొద్దు మాకని, కరుణతో అవి నిలపమంటే
కల్లు సారాలమ్ముకుంటే, ఖజానాలు నిండవంటూ
కల్లు వద్దను పేదమహిళల, కుళ్లగొట్టే నేతలారా
బ్రతుకనిస్తారా, వారిని చావమంటారా?

వళ్లు హూనం చేసుకుంటూ, వ్యవసాయం చేస్తామంటే
ఎరువు ధరలు పెంచివేసి, బరువు చేస్తిరి రైతు బ్రతుకులు
రైతుల వెతలు బెట్టి, రాజ్యమేలే నేతలారా
బ్రతుకనిస్తారా, వారిని చావమంటారా!

స్వార్థమే పరమార్థమై మా శ్రేయమే ఎవరికి పట్ట దేమి
ఏ పార్టీ పదవి నున్న, ఎవరు పరిపాలనము చేసిన
ప్రజల బ్రతుకుల హాయి కూర్చే, ప్రభువులే కనుపించమి
బ్రతుకనిస్తారా మీరే, చావమంటారా !

## జనవాణి

(3 పేజీ కొరవ)

రాష్ట్రంలోని మారుమూల గ్రామాల్లో వున్న హరిజన వాడలు, లంబాడి తండాలు,మత్స్యకార్మికుల పాళాలకు 8వేలు విలువ జేసే టివి ఇస్తారట. ఎందుకండీ ఈ ప్రయోజనం లేని ఆలోచన! కడుపు నిండా తిండి, కట్టుకోను బట్టలు, వుండడానికి చిన్నగుడిసె కోసం అల్లాడిపోతున్న ఈ జీవులు సరదాల కోసం టి.వి.లడిగారా మంత్రిగారూ? బియ్యం ధర పెరిగింది. నిత్యావసర సరుకుల ధరలు చుక్కలంటాయి, ఎక్కడ చూసినా దోపిడీలు దొంగతనాలు. వీటిపై దృష్టికేంద్రీకరించండి సార్.

నెల్లూరు. -యద్దనపూడి సరోజిని

### టవర్ క్లాక్ గతి అంతేనా?

టౌన్‌లో వి.ఆర్. కాలేజి వద్దనున్న గడియారం స్థంభంలోని గడియారం గత 6 నెలలుగా పనిచేయడం లేదు. అది ప్రైవేట్ యాజమాన్యం అధ్వర్యంలో నడిచే సమయంలో నిత్యం పనిచేస్తుండేది. మున్సిపాలిటీ స్వాధీనం చేసుకున్నాక మూలన పడి, సెంటర్‌లో దిష్టిబొమ్మగా మారింది. ట్రంకురోడ్డులోని అమర వీరుల స్థంభం వద్ద, పప్పులవీధి మొదట్లో గోడగడియారాలు ఉండేవి. అవి నేడు కాలగర్భాన కలిసి పోయాయి. టౌన్ కు అందాన్ని, ప్రజలకు సమయాన్ని తెలియజేసే ఈ గడియారాన్ని మున్సిపాలిటీ వెంటనే బాగుచేయాలి.

నెల్లూరు. -జి. శివరాంసింగ్

### అయ్యప్ప భక్తులు విధిగా దీక్ష పాటించాలి

శ్రీ స్వామి అయ్యప్ప దీక్షలో ఉండే వారు విధిగా కొన్ని నియమ, నిబంధనలు పాటించాలి. పలురకాల వ్యక్తులతో కలుషితమై పోయి ఉన్న జనసమూహంలో తిరగడం తగ్గించుకొని ఏకాంతంగా ఉండాలి. సినిమాలు, షికార్లు, నిషిద్ధమన్న సంగతి మరువ కూడదు. మడి, శుచి, శుభ్రత, కరువై పోవడం బాధాకరం. వృత్తి వ్యాపారాల్లో మునిగి తేలేవారు కనీసం రోజుకు రెండు గంటలైనా అయ్యప్ప ఘోష చేయాలని మరువ కూడదు!

-గునుపాటి వేణుగోపాల్

నెల్లూరు.




వెంకటగిరిలో హ్యాండ్ ల్యూమ్ టెక్నాలజీ భవన ప్రారంభోత్సవ శిలాఫలకం ముందు జనార్దన రెడ్డి.

దివాకర రెడ్డి, నమర సింహా రెడ్డి, పెంచలయ్య, రాజకుమారి, పాటి రాజం

## పినాకినీ తీరం

(2 పేజీ కొరవ)

ఆ పత్రికలలో ఒకటి ఒక కాపుదు సారా... పుత్రిత్రి రవాణా ప్రోమాట్లుకు బ్రహ్మరథం పట్టడాన్ని ఏమనుకోవాలి? ఎందుకను కోవాలి? ప్రతిష్ట గలిగిన ఆ దినప్రతిక అంత దివాలా కోరుతనానికి రావడం శోచనీయం!

పత్రికలను నిందించడం, విమర్శించడం నా వుద్దేశ్యం కాదు. ప్రాతినిధ్యంగా వుండి తోటి పత్రికల మీద విరుచుకపడడం పత్రికా సాంప్రదాయాలకు విరుద్ధమే కాదు, సభ్యతా రాహిత్యం కూడా! కాని రోజురోజుకు తెలుగు దినపత్రికలు అనుసరిస్తున్న వెర్రి పోకడలు, విద్వేషపు ధోరణులను చూస్తూ వూరకుండలేక వ్రాయక తప్పడం లేదు. తమ వ్రాతలతో ఏమైనా చేయవచ్చు. ఎవరినైనా శాసించవచ్చు. ఏ ఆటైనా ఆడవచ్చుననే దురహంకార ధోరణి కాని, పత్రికల మధ్య పరస్పర పోటీలు వెర్రితలలు వేయడం కాని మంచిది కాదు. తెలుగు దినపత్రికలు ఒకదానిలో ఈ ధోరణి స్పష్టంగా కనపడుతుంది. పత్రికా వ్యాసంగము, నిర్వహణ ఒక వ్యాపారమైతే అటువంటి పత్రికలు ప్రజలకు మేలు చేయలేవు.

సారాయి సమస్య పరిష్కారం గొంతు మీద కత్తిపెట్టి చేస్తావా చస్తావా అన్న బెదిరింపు ధోరణితో జరగ దగింది కాదు. బాధ్యతా యుతంగా వివిధాంశాలను అన్ని కోణాల నుండి సమగ్రంగా పరిశీలించి జాగ్రత్తగా అడుగు వేయవలసిన సమస్య. అటువంటి క్లిష్ట సమస్యను పార్టీలు రాజకీయం చేసి ఎగురుతుంటే, పత్రికలు వాటిని ప్రోత్సహించడం, పాఠకుల విషయంలో తమ ధర్మాన్ని నిర్వర్తించడ మవుతుందా?

సారాయి వ్యతిరేక ఆందోళన ఆ సమస్యను శీఘ్రంగా పరిష్కరించుటకు ప్రభుత్వాన్ని వుద్యుక్తం చేసినది. ప్రభుత్వం దాని మీద దృష్టిని కేంద్రీకరించి వుంది. తక్షణం మద్య నిషేధమనో మరొకటనో మొండి పట్టుదలతో కాకుండా ఆచరణ సాధ్యమైన, అన్ని విధాల ఆమోదయోగ్యమైన నిర్ణయానికి అందరూ దోహదమివ్వడం అవసరం. పత్రికలు అటువంటి వాతావరణాన్ని కల్గించ గలిగితే ఎంతో వుపకారం చేసినట్లవుతుంది.

### నాలుకమీద వాత పెట్టాలి!

ఎన్టీరామారావు గారు నే పెట్రేగి పోతున్నారు సభ్యతా సంస్కారాలు మరచి వీధికి వచ్చినట్లు వాగుతున్నారు. అసెంబ్లీలోనే శ్రీమతి నన్నపనేని రాజకుమారిని అశ్లీల పదజాలంతో దూషించి ఆమె చేత కళ్ల నీళ్లు పెట్టించాడు. మహిళా సభ్యులందరూ కాకుల్లా పొడిచేటప్పటికి దాసరి తప్పులు దణ్ణంతో సరి అన్నట్లు క్షమాపణ చెప్పి ప్రాయశ్చిత్తం చేసుకున్నారు. సారాయి ఆందోళన విషయంలో నియమింపబడిన వుప సంఘం సభ్యులను 'వీరు ఒక తల్లికి పుట్టిన వారా' అని అలబరి తనంగా వాగాడు. వీరు ఒక అమ్మ అబ్బకు పుట్టినోరు కాదు అని అలగా జనం అనాగరికంగా తిట్టుకుంటారు. రామారావు అన్నమాట దీనికంటే తీసిపోతుందా? ఆయన వారి కంటే భిన్నమవుతాడా? ఇటువంటి వారికి ఒకసారి నాలుక మీద వాత పెట్టందే గాని వాళ్లు తెలిసి రాదు!

సారాయి వ్యతిరేకోద్యమం ప్రారంభమైనపుడు రామారావు గారు అంతులేరు; కుయ్‌కయ్ అనలేదు. అది మహిళా వుద్యమంగా పరిణామం చెందుతుండే సరికి గోడ మీద నుండి దూకినట్లు, అంతకు ముందు వుద్యమంలో వున్న పార్టీలను నాయకులను వెనక్కు నెట్టి, దూకాడు. 1983లో తాను గెల్చింది స్త్రీల ఓట్లతో; వారి అభిమానాన్ని తిరుగా పొందడానికి ఈ వుద్యమం చక్కని అవకాశమని, సమయం మించితే దొరకదని కోరబద్దాడు, వెలరేగి మాట్లాడుతున్నాడు.

ఏడేళ్లు తాను అధికారంలో వుంటే త్రాగుడు వల్ల నాశనమై పోతున్న పేద వారు ఆయనకు కనపడలేదు; మద్యనిషేధపు ఆలోచన కలుగలేదు; శాసన సభలో ప్రశ్నిస్తే సారాయి ఆదాయాన్ని బంగారు గుడ్లు పెట్టె బాతుగా అభివర్ణించి వారుణీ వాహినిని సమర్థించుకున్నాడు. అటువంటి రామారావు అప్పుడెవరూ మద్యనిషేధాన్ని కోరలేదని అబద్ధం చెప్తూ మొసలి కన్నీరు కారుస్తున్నాడు. రామారావు ఓట్ల భక్తుడే కాని, ప్రజల హితుడు కాదు. తాను ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన రోజే మద్యనిషేధం అమలు జరుపుతాడట. కిలో రెండు రూపాయల బియ్యం అప్పుడే ఖచ్చితంగా చెప్పలేనని ప్రకటించిన రామారావు. అధికారానికి వచ్చిన ఘడియలో బియ్యం రెండు రూపాయలకే సరఫరా చేస్తాననంటున్నాడు. అధికారానికి రావాలనే తపన కొద్దీ. ఈ సారి అధికారానికి వచ్చినట్లే నని పగటి కలలు కంటూ ఎలక్షన్ మొక్కులుగా వాగ్దానాలు చేస్తున్నాడు. అమలు జరపలేని ఆ అపద మొక్కులను నమ్మి పొరపాటు బడితే అది రాష్ట్రానికి కీడు చేసినట్లవుతుంది.

కాంగ్రెస్‌లో మూడేళ్లలో రెండో ముఖ్యమంత్రిని కూడా మార్చి వేయడం, రామారావులో ఆశలను చిగురింపజేసిందా అనిపిస్తుంది. 1983 లో విజయభాస్కర రెడ్డి గారి నుండే తెలుగుదేశం అధికారాన్ని పొందింది. అటువంటి లక్కీ ఛాన్సు ఇప్పుడూ దొరక వచ్చుని రామారావు ఆశ ఏమో!. కాంగ్రెస్ అగ్రనాయకులు ఇదే ధోరణిలో వుంటే, రాష్ట్రంలోని కాంగ్రెస్ నాయకులు ఈ విధంగానే పోట్లాడు కుంటుంటే చరిత్ర పునరావృతం కాదని ఎవరు చెప్పగలరు?

## ప్రెసిడెంటు గారి పెళ్ళాం

(9 పేజీ కొరవ)

చిత్రం ఆద్యంతం విసుగని పించకుండా ఉండేందుకు దర్శకుడు కోదండరామి రెడ్డి పటిష్టమైన స్క్రీన్‌ప్లే నడప లేక పోయారు. చిత్రం చివరి భాగంలో సినిమా అయినట్లే ననిపించి మళ్ళీ కొనసాగ దీశాడు. కామెడీ కోసమని పెట్టిన బ్రహ్మానందం పాత్రను చిత్రం సగం వరకు

✪✪✪✪✪✪✪✪✪✪✪

### అంకురార్పణ

— అల్లూరు రహీం

ఆపూళ్లో...
సురా సంగమంలో
కామందులు కూలీలయ్యారు
ఎన్నడూ గడప దాటని 'ఇంతులు'
వేల గనాలు తొక్కారు.
ఇళ్లు ... వళ్లు గుల్ల చేసుకున్న
'చిన్నయ్య' ఆత్మాహుతి..
చిత్తు సారా పొట్లాలలో నిల్వోసుకొని త్రాగే
చిన్న పిల్లల వారసత్వపు సంస్కృతి
'దూబగుంట' ఆడోళ్లను ఆలోచింప చేశాయ్.
అక్షర యజ్ఞఫల అనుయాజ్ఞతో
అడుగు ముందు కేసి..
'కలకత్తా కాళికలై' 'కల్లు-సారా'
వ్యతిరేక పోరు సల్పి చరిత్ర పుట లెక్కారు.
దిన్ని ... ఆనోటా -ఈనోటా
విన్న సింహపురి స్త్రీలు అలనాటి
పౌరుషాన్ని అలవోకగా గుర్తుకు
తెచ్చుకొని సింహాల్లా గర్జిస్తూ
ప్రభంజనం సృష్టించారు.
వీరి మొక్కవోని ఆత్మ విశ్వాసానికి
ఖాకీ లాఠీలు ... సారా రాజులు
గులాములై సలామ్ చేస్తే,
ప్రకృతి పులకించి వర్షించింది.
రాష్ట్రమంతా 'సారా' వ్యతిరేక హోరులో
అట్టుడికి పోవడంతో అధికార గణం
ఆలోచనలో పడితే ... నిత్యం
క్షుద్ర రాజకీయంసలుపను సంసిద్ధంగాఉండే
పక్షాలు... నేడు జెండాలు పట్టుకొనిమేమున్నా
మంటూ ముందు కొస్తున్నాయ్.
అది మహిళా మణులపై ప్రేమతోనా...?
కానే కాదు.
రాజాలను 'తరాజాలు' చేసే ఓట్లకోసం!
అది గమనించి మన గమ్యం రూపొందిద్దాం
మగవారి నయానా, భయానా నచ్చచెప్పి
ఉద్యమానికి ఊపిరి పోయను
మరో సత్యాగ్రహానికి స్వగృహంలోనే
అంకురార్పణ చేద్దాం

✪✪✪✪✪✪✪✪✪✪✪

చూపి రెండవ సగంలో అతను ఏమైపోయాడా అని ప్రేక్షకులు జుట్టు పీక్కునేలా చేశారు. పాటల చిత్రీకరణలో దర్శకుడు ప్రత్యేక శ్రద్ధ కనబర్చినా సాహిత్యం, సంగీతం ముందు నటీనటుల నృత్యం మరుగున పడింది. నృత్య దర్శకులు తార- ప్రసాద్ నటీనటుల నృత్యం చేయించ లేక పోయారు. కాపీ కొట్టిన కథ కాబట్టి కథకులు రమణీ- మధుల గూర్చి చెప్పుకోవలసిన అవసరంలేదు. తోటపల్లి, మధు మాటల మరీ విస్సారంగా ఉన్నాయి. హీరోయిన్ తరచూ పలికే 'ఉమ్మకావాలి' అనే మాట ఎబ్బెట్టుగా అనిపిస్తుంది. సూపర్ సుబ్బరాయన్ ఫైట్సు ఆసక్తి కరంగా రూపొందించినా యిందులోనూ నాగార్జున మరుకుదనం చూపించలేక పోయారు. వేటూరి కలం తేట తెలుగుదనం నింపి చిందించింది 'మంచూరి అందోతు మందలోన రంగవేస్తే' 'తసావిక్కా- తలాంగుచుక్కా' 'ఉమ్మకావాలి' పాటలు బాగున్నాయి; మిగతావి కూడా పరవాలేదని పించాయి. సంగీతం కూర్చిన కీరవాణి మాత్రం 'పరువాలకోడి' అనే పాటను ఇటీవల హిట్ అయిన ఒక చిత్రంలోని పాట ట్యూనింగ్‌తో యదాతథంగా మలచారు. అదేవిధంగా మరో సంగీత దర్శకుడు ట్యూన్ చేసిన ఒక బిట్ తరచూ చిత్రం నేపథ్యంలో యథేచ్ఛగా వాడుకున్నారు. హీరోయిన్ మీనా చాలా హుషారుగా నటించింది. పాత్రోచితంగా ఆమె ధరించిన దుస్తుల్లో అందం వుట్టి పడినా ఈ మధ్య వళ్లు చేసినట్లు కనపడింది. హీరో నాగార్జున ఎంత హుషారుగా నటించను ప్రయత్నించినా ఎందుకో ఒప్పించలేక పోయాడు. మరీ వదులుగా ఉండే దుస్తులు, బాగాలేని హేర్ స్టయిల్ అతన్ని మరీ బలహీనుడు గా కనపడేటట్లు చేశాయి. మిగతా పాత్రల్లో సత్యనారాయణ, చంద్రమోహన్, కోటశ్రీనివాసరావు, బ్రహ్మానందం, పాత్రోచితంగా నటించారు. పలు హంగులు చిత్రంలో ఉండడం వల్ల 'మాస్' ను విపరీతంగా ఆకట్టుకోవడం ఖాయమనే చెప్పవచ్చు

## అటు సూర్యుడు

(2 పేజీ కొరవ)

సరికొండోలుడే. మాత్రం శాశ్వతం! ఒకరినొకరు వదులుకోరు, వదులుకోలేరు.

* * *

ఈ నెలలో జరిగిన జనార్దన రెడ్డి గారి రెండు జిల్లా పర్యటనలలోనూ కావలి ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డి కన్పడలేదన్నది చర్చగా వుంది. ఆయన జంట- విష్ణు కూడా గైర్‌హాజరే! కారణమేమి?

ఇంకే ముంది ? పదవీకాంత పరిష్వంగ సుఖం అందినట్లు అంది చేజారిన ఆశాభంగ దుఃఖం నుంచి ఇంకా తేరుకోలేక పోవడమే కదా! మనసుకు తగిలిన ఆ గాయం మానిన తర్వాత మళ్ళీ మామూలు గానే జనార్దనరెడ్డి శిబిరంలో ఆ హరిణం చెంగు చెంగున ఎగిరి ఆనందింప జేస్తుంది. ఈ లోపలే బోర్డు త్రిప్పినట్లు మాట్లాడడం అన్యాయం. బోర్డు తీసేస్తే తిరిగి తగిలించడానికి జిల్లాలో వేరే స్థలం ఎక్కడుంది చెప్పండి?

## సినిమా

(9 పేజీ కొరవ)

దర్శకత్వంలో శ్రీ సాయిఫిలిమ్స్ నిర్మించే తొలి చిత్రంలో నరేష్, ఆమని, కోట శ్రీనివాసరావు, వేలు, సుధాకర్, బాబూమోహన్, బ్రహ్మానందం, శుభలేఖ సుధాకర్, వై.విజయ, శ్రీలక్ష్మి, అన్నపూర్ణ పాత్రధారులు. నెల్లూరీయుడు వెన్నెలకంటి కథకుడు.

**జమీన్‌రైతు**

సంవత్సర చందా రూ.100.00
అరు నెలలకు రూ.50.00
విడిప్రతి రూ.2.00

# ప్రజల ముంగిటకు ప్రభుత్వం ప్రజా సేవకు పునరంకితం

37వ ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం



శ్రీ పి.వి. నరసింహారావు
ప్రధానమంత్రి








శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి
ముఖ్యమంత్రి

## ప్రాధాన్యతగల పథకాలు

- ఆర్థికాభివృద్ధి కొరకై సహజ వనరుల అత్యధిక ఉపయోగం.
- ఏమాత్రం జాప్యం లేకుండా షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల వారికి కేటాయించిన ఖాళీ ఉద్యోగాల భర్తీ.
- గిరిజన ప్రాంతాలలో మరిన్ని ఏకోపాధ్యాయ పాఠశాలల స్థాపన.
- గిరిజన సహకార సంస్థ ద్వారా గిరిజనులచే ఉత్పత్తి చేయబడిన చిన్న తరహా అటవీ సంపదను పెద్ద మొత్తాలలో కొనుగోలు చేయుట.
- రబీ పంట కొరకై కరువు ప్రాంతాలలో సేద్యపునీరు సమకూర్చేందుకు కార్యాచరణ ప్రణాళిక.
- అమలులో వున్న సేద్యపు నీటి ప్రాజెక్టులు త్వరితగతిన పూర్తి చేసేందుకు ఒక కార్యాచరణ కార్యక్రమం.
- అన్ని విధాల కనీస సౌకర్యాలతో ప్రతి కుటుంబం ఒక సొంత గృహాన్ని పొందే అవకాశం కల్పిస్తూ బలహీన వర్గాల గృహనిర్మాణ కార్యక్రమాన్ని విస్తృత పరచడం.
- ప్రజలనుండి వచ్చే ఫిర్యాదులను సత్వరం పరిష్కరించేందుకు ఫిర్యాదుల విభాగాన్ని పటిష్టం చేయడం.
- శాంతి భద్రతలను కాపాడేందుకు అరాచకత్వాన్ని,హింసావాదాన్ని తీవ్రంగా అణచి వేయటం.
- ప్రజల సమస్యలపై తక్షణ ప్రతి స్పందన.
- జంటనగరాలలో తెల్ల రేషను కార్డులపై నెలకు కిలో 3.50 రూ॥ చొప్పున 16 కిలోల బియ్యం,అదనంగా కిలో 5 రూ॥ చొప్పున 20 కిలోల బియ్యం సరఫరా. గులాబి రంగు రేషన్ కార్డుల పై నెలకు కిలో 5 రూ॥ చొప్పున 20 కిలోల బియ్యం సరఫరా.
- రాష్ట్ర వ్యాప్తంగా డి.ఎ.పి. ఎరువులను బస్తాకు 100 రూ॥ చొప్పున తగ్గించి రైతులకు సరఫరా.

**ప్రజాసంక్షేమ దినోత్సవం**
**5-11-92 సా॥ 5.00 గం॥.లకు**
**నిజాం కాలేజి గ్రౌండ్స్‌లో**
**బహిరంగ సభ**
**అందరూ ఆహ్వానితులే**

# ప్రజా సంక్షేమమే ప్రథమ ధ్యేయం

సమాచార పౌరసంబంధాల శాఖ, ఆం.ప్ర.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.